# నీతికథారత్నావళి



గ్రంథకర్త,

అనిపెద్ది జగన్నాథశాస్త్రి.

CT

# కార్తిక మాహాత్మ్యము

డెమ్మీ సుమారు 200 పేజీలు.


గ్రంథకర్త,

అనిపెద్ది జగన్నాథశాస్త్రిలుగారు

ఆంధ్రపండితులు.

బోర్డుహైస్కూలు, కొవ్వూరు.


ఈ పురాణము సులభమగు శైలిని, స్త్రీలకు గూడ నర్థమగురీతిని, రచింపఁబడినది. కార్తికమాసమునందు హిందువులు చేయదగిన విధులన్నియు, చక్కని యుదాహరణ రూపమయిన కథలతో విమర్శించి వ్రాయఁబడినవి. ఈ యుత్తమగ్రంథమునందలి పద్యములరచమునుగూర్చి పండితులును బ..)కాధిపతులును పెక్కురు మంచి యభిప్రాయముల నొసఁగియున్నారు.

వెల రు 1—0—0 మాత్రమే. పోష్టుఖర్చులు ప్రత్యేకము.

వలయువారు:—

**కమలకుటీరము.**

నర్సాపురం.

# నీతికథారత్నావళి

గ్రంథకర్త,

ఆనిపెళ్ళి జగన్నాథశాస్త్రులుగారు.

ఆంధ్రపండితులు.

బోర్డుహైస్కూలు, కొవ్వూరు.



నర్సాపురము
సీతారామా ముద్రాక్షరశాల
యందు ముద్రింపబడినది.

1930

 [వెల 0—12—0.

C

*B. Venkateswara Rao*

# పీఠిక. *Telaprolu.*



పురాణములనుండియు, లోకులనుండియు, నెడనెడ వినుచుండు నీతిదాయకములగు కథలను గొన్నిటి నేర్చి యొక చిన్న పుస్తకముగాఁ గూర్చి, బడులయందలి బాలకులకు వీనిని బోధించుతలంపు చిరకాలమునుండి కలిగియుండినవాఁడనగుటచేత "నీతికథారత్నావళి" యను నామమున నీ పుస్తకము నచ్చొత్తించితిని.

నేటికిఁ బదునెన్మిది వత్సరముల యనుభవముగల పాఠశాలాపండితోపాధ్యాయత్వముచేత, నీతికథలయందు బాలురకుఁగల యుత్సాహము నెఱింగియుండుటయే, నన్నీ పనికి బ్రోత్సహించినది.

పాఠశాలా ప్రధానోపాధ్యాయులు, బ[illegible]ను, నాయీప్రయత్నమును దమ స్వభావప్రేమముతో నాదరించి నా కృతజ్ఞతాభివందనముల నందుకొనఁ బ్రార్థితులు.

ఈ గ్రంథ ముద్రణమందు నాకు సాయమొనర్చిన మా హైస్కూలునందలి ఉపాధ్యాయసోదరులకు నా కృతజ్ఞతానేక వందనములు!

ఇట్లు విధేయుఁడు,
అనిపెద్ది జగన్నాథశాస్త్రి
ఆంధ్రపండితుఁడు.
బోర్డుహైస్కూల్.

కొవ్వూరు
25-8-30

D

# విషయసూచిక.

మా. గ్రామ రెడ్డి ... తెలుగు ...

T. Sarva Reddy

శుభమస్తు.

శ్రీరామ చంద్రాయనమః.

# నీతికథారత్నావళి.

(మొదటి భాగము)

## 1. మానవుఁడస్వతంత్రుఁడు.

—:0:—

"తే॥ గీ॥ కష్టముల వెన్క సుఖములు గలుగుచుండు
సుఖములకు వెన్కఁ గష్టముల్ సూచుచుండు
దైవగతిచేత, నయ్యవి తప్పవెపుడు.
మానవుఁ డస్వతంత్రుఁడు వానియెడల"

అఱువది వర్షముల వయసు వచ్చినను దిరిపెమెత్తుకొని జీవించు నొక భూసురుఁడు దేవదత్తుఁ డనంబడు నాతఁడు తన దరిద్రదశకు విసువుఁజెంది, యిహపరములం జెఱుచుకొనుటకు వెఱచి యరణ్యమునకరిగి, హరిచరణముల స్మరించుచుఁ బరమపదమును జేరఁ గోరి తపము జరుపుచుండెను.

అంత నొక్కనాటి రాత్రిభాగమున నాతఁడు నిద్రించుచుండ స్వప్నమందు లక్ష్మీమహాదేవి దర్శనమిచ్చి, దేవదత్తా! నీకు విశేషమగు నైశ్వర్యము నొసంగఁదలఁచి వచ్చిన మహాలక్ష్మినిగా నన్నెఱుంగుము. వలయు సంపదలఁగోరుకొమ్మని యానతిచ్చెను.

దాని కాతఁడంగీకరింపక యిట్లనియె. "నాకుఁ గావలసివచ్చినప్పు డెన్నఁడును నీవిట్టిదయను జూపినదానవు కావు. సర్వసంగములకును స్వస్తిచెప్పి సాంద్రారణ్యమున ముక్కుమూసికొని తపమాచరించుకొను నాకు నీయనుగ్రహము వలనఁగాఁదగు ప్రయోజన మొక్కింతయులేదు. కావున నెందేనిజని సంసారులఁ దరింపఁజేయుము. నీసంబంధము నాప్రస్తుతవర్తనమున కపాయకరము."

అదివిని యాభార్గవి, "ఓయీ! నీభాగ్యము నీయధీనము కాదు. మానవుఁడు దైవాధీనుఁడు. సను స్యానుసారము గ సంపదలు రాక తప్పవు. నేను నిన్నావహించి తీరెదను." అనెను.

"ఓచపలా! నన్ను నీవెట్లావహించెదవో చూచెదను లెమ్ము. ఈపందెములో గెలుపు నాదియేసుమీ!"యని దేవదత్తుఁడు మేల్కని లేచి యిట్లు తర్కించెను. "ఏమిది? స్వప్నమిట్టిది యింతకుమున్నెన్నఁడును వచ్చియుండలేదు. ఇక్కల నిక్కమగునేని నాపరమార్థప్రవృత్తికి భంగమువాటిల్లును.

ఈవిషయమునఁ గడుంగను జాగరూకుఁడను గావలయును."

ఇంతలోఁ దెల్లవాఱెను. రాజభటులిద్దఱువచ్చి యెదుట నిలువంబడి యుండిరి.

దేవ:-మీ రెవ్వరు?

భటు:-రాజ సేవకులము.

దేవ:-ఇచ్చటికి రాఁ గారణ మేమి?

భటు:-మిమ్ములఁ గొనిరమ్మని రాజాజ్ఞయైనది.

దేవ:-ఎందులకు?

భటు:-అదిమాకుఁ దెలియదు. తెలిసికొనుట మాపనిగాదు.

దేవ:-నేను రానంటినని చెప్పుఁడు.

భటు:-అది మీయిష్టములోలేదు. రాజాజ్ఞ!

దేవ:-నాకు రాజుతో సంబంధములేదు.

భటు:-మీకు సంబంధములేకపోయినను, బంధింప బడియైన రాకతప్పదు.

దేవదత్తుఁడు చేయునదిలేక, యీవిషయము రాజుతోఁడనే ముచ్చటించి పిలువఁబంపిన కారణమారయుదునని వారితో బయలువెడలి రాజునొద్దకుఁబోయి, "రాజా! నన్ను బిలువనంపఁ గారణ మేమ"నియడిగెను. రాజాతని గౌరవించి యిట్లనియె." అయ్యా! మీవంశమువారు మాపెద్దల రాజ్యమున మంత్రులైయుండిరనియు, నిప్పుడు రాజ్యము మఱింత

సుభిక్షముగ నుండెననియు వింటిని. ఆవంశమున నేఁటికి మీ రొక్కరే నిలిచియుండిరని విని, నాయమాత్యపదవిని మీ కొసంగఁదలంచితిని. అది గ్రహించి రాజ్యమును వృద్ధినొందింపఁ గోరుచుంటిని." దేవదత్తుఁడందుల కంగీకరింపలేదు. ఆ పదవి మఱియొకని కొసంగవచ్చుననియు, నేను నిస్సంగుఁడనై యుండి తపమొనర్చుకొనుచుంటిననియు, నావలన మీ కెట్టి ప్రయోజనముగాని కలుగదనియు, నాతఁడు వాకొ చ్చెను. రాజు, "మీతపమునకు భంగము వాటిల్లకుండఁ గాపాడుదును. మీరిచ్చటి నుండి యెుందుకడకుఁ బోవరాదని" యుత్తరువొసంగెను. రాజాజ్ఞాతిరస్కారము సాధ్యపడక యెట్లయినఁ దప్పించుకొను నుపాయ మాలోచించుచు నాతడటనివసించెను. మంత్రిత్వమునకు వలయువైభవములన్నియు నాతనికి లభించెను. సమస్తసంపదలతో నాతఁడు తుల దూఁగుచున్నను, నది యాతనికిఁ గడుంగడుఁ బ్రతిబంధకముగఁ దోఁచుచుండెను.

ఇట్లు కొంతకాలము గడచినంత నొక్కదినంబున నట్టమధ్యాహ్నమప్పుడు రాజసదనంబునకుం బోయి మంచముపైఁబన్నుండి నిద్రించుచున్న రాజుంగాంచి, నాయుద్యమము కొనసాగుటకిదియ సమయమని యాభూపాలుని పాదంబులనందుకొని బరబర మని రాజవీధికీడ్చుకొనివచ్చెను. అంతట నాతఁడు నిద్రించుచున్నచోటనున్నగోడ యొకటి

కూలి యామంచము ఖండఖండములయ్యెను. అంత నాభూవరుఁడా దేవదత్తుం గౌఁగిలించుకొని, "మిత్రసత్తమా! నా ప్రాణంబులం గాచితివి. త్రికాలవేదివి. నీవు నీతొల్లిటివారిం బోలితివి. నీయుపకృతి మఱవఁజాల. ఇవిగో గైకొమ్మని" కొన్ని సహస్రరూప్యంబులాతనికి బహుమానమొసంగెను.

దేవదత్తుఁడు దైవయోగమునకుఁ జాలయబ్బురపడి, చేయునదిలేక యూరకుండెను. ఆరాత్రి మరల లక్ష్మి కలలోఁ గాన్పించి "దేవదత్తా! ఇప్పుడెట్టి స్థితిలోనుంటివి. పందెమెవ్వరిది నెగ్గినది?" యని యడిగెను. "అమ్మా! మానవమాత్రుఁడను. నాయజ్ఞానమునకు నేనే సిగ్గిలుచుంటిని. నీవు నన్ను విడిచిపోవునప్పుడుగూడఁ జెప్పి పోవలయుఁజుమీ" యనిప్రార్థించెను. అందుల కాయిందిర యంగీకరించి వెడలిపోయెను.

రాజునకొకనాఁడు వేఁట తమకము జనింప మంత్రిని వెంటఁగైకొని యుచితపరివారముతో నడవికింబోయి క్రూరమృగముల వేఁటాడి యొక మఱ్ఱినీడ విశ్రమించి నిద్రావశుఁడై యుండ, నాచెట్టుపై గరుడుని కాళ్ళఁదగులుపడియున్న సర్పమొకండు విషము గ్రక్కుటయు, నాగరళమాతని కంఠభాగమునంబడెను. అదిగని మంత్రి శంకించి రాజు ఖడ్గముఁగైకొని యావిషమును దొలఁగింపఁగోరి రాజునొద్దకు వచ్చెను. ఇంతలో లక్ష్మి దేవదత్తునికిఁ బ్రత్యక్షమై తొలఁగిపోవుచుంటినని చెప్పెను. రాజు మేల్కనెను. రక్తనేత్రుఁ

లతో మంత్రింగాం చెను. "ఎంతరాజద్రోహమున కొడిగట్టి తివి? నన్నీ ఖడ్గమున వధించి రాజ్యపాలనము జేయ నెంచితి వా? పోపొమ్ము. నాపట్టణముం ద్రొక్కి చూచితివేని నీ తలఁ దీయింతునని" యుగ్రుఁడై పలికెను. మానవుని యస్వ తంత్రతకు దేవదత్తుఁ డాశ్చర్యపడి బంధంబు సడలెనని సంత సించి యథేష్టంబుగ నచ్చటినుండి తొల్లితాను నివసించిన యరణ్యంబుం జేరి ముముక్షుత్వంబునఁ దపం బాచరించి దివ్య గతిం జూఁజగొనియెను.

---

## 2. వృద్ధోపదేశము వ్యర్థము గాఁబోదు.

కం॥ నీతినివిడనాడి, మహా
పాతకముల నాచరించి, పతితుండై, వి
ఖ్యాతిసెడు, జడుడు, గురుకృప
చేతఁ బునీతుఁడయిసర్వసిద్ధులఁ జెందున్॥

ఒక దినమునఁ గశ్యపుఁడు మొదలగు సప్తమహర్షులు ను భూలోకంబున సంచరించుచు నొక యరణ్యమార్గంబునఁ బోవుచుండిరి.

ఆమార్గంబున వచ్చుచుఁబోవుచుండువారిని గొట్టి ధన ము నార్జించువృత్తి నవలంబించిన, యొకబోయవాఁడాదారిం

బోవు మహర్షుల కెదురై మీకడనున్నసొత్తు నక్కడఁబెట్టుండని యడ్డగించెను. అంతటవారు తమ తమ దండకమండలాదులచ్చటం బెట్టి యాబోయుంగాంచి యిట్లనిరి.

ఓయీ! పరద్రవ్యాపహరణము పాతకము! దానిలో, బ్రాహ్మణద్రవ్యము హరింపఁజూచుట మహాపాతకము. బ్రాహ్మణద్రవ్యాపహరణమును, బంగారును దొంగిలించుటయు సురాపానమొనర్చుటయు, గురుభార్యాగమనమును, అవిచేసిన పాపులతోఁ జేరుటయు నివి పంచమహాపాతకములని పెద్దలు వక్కాణించిరి. నీవు ముందువెనుక లారయక వీరువారనక దారిం జరించువారి ధనంబులను హరించుచుంటివి. ఇది నీకీ లోకంబునందేగాక పరలోకంబునందుంగూడ మిగుల హానికరము. నీవిది యాలోచించినట్లు మాకుఁ దోచదు. కేవలము మాకొఱకే నీకీనీతిని బోధించుచున్నామని నీవు తలఁపవలదు. మాకు దేహేంద్రియాదులయం దభిమానములేదు. నీవీకట్టిన కాషాయవస్త్రంబులు కావలయునన్నను నీకొసంగి దిగంబరులమై తిరుగఁగలము. నీవిట్టి ఘోరమగు నరకగతికిఁ బాలగుచుంటివే? యను విచారమున నీకీమాటలు చెప్పితిమి. నీచిత్తమున స్పష్టముగ మామాటలను బరికించి నీయిచ్చవచ్చినట్లు నడువవచ్చును. అనిన నాబోయవాఁడు, అయ్యా! పాతకమన నెట్టిది? అదియేమి చేయును? అని ప్రశ్నించెను. దానికా మునిసత్తము లిట్లనిరి. పాతకము కష్టి

కగుపడునదికాదు. పుణ్యపాపములకుండు భేదము రెండుమాటలతో నీకుఁ దెలియునట్లు చెప్పెదము వినుము. ఏదైన నొకరీతినిఁ బరుల కుపకారము చేయుట పుణ్యమనఁబడును. పరులను బీడించుటయేఁ బాపమనఁబడును. అట్టిపాపము పరలోకమున నరకబాధలను గలిగించును. ఆబాధల ననుభవించుట కడుదుస్తరము. అది యనుభవించుటయేఁగాక యనేకములగు నీచజన్మములఁగూడ నెత్తిపుట్టుచుఁ జచ్చుచుండ వలసివచ్చును. అయ్యది మఱియుఁ గష్టతరంబు! అనినంత నాబోయడు భయంబుగదుర నిట్లనియె. అయ్యలారా! నేను భార్యాపుత్రాదుల భరించుటకే దొంగతనమును చేయుచుంటిని. దీనిచేఁ గలిగెడు పాపమీ ధనముచేఁ బోషింపఁబడువారెల్లరున సమానముగ ననుభవింతురుగదా? ఈభారము నాయొక్కనిదే యెట్లగును? అనియెను.

అయ్యది నీభార్యాపుత్రాదు లంగీకరించినచో నీకంతభారము లేదుగాని వారంగీకరింపకున్న నీకు తప్పనిదేగదా? యనిరి. అట్లేల యంగీకరింపకుందురు? ఇది యనుభవించి యది యనుభవింపకుందురా? అయినను గనుంగొని వచ్చెదనుగాక! మీరిచ్చటనే యుండుఁడు. మీరు మహానుభావులవలె నగపడుచున్నారు. మీరు తప్పించుకొని పోయెదరను ననుమానము నాకు లేదు. అని వారియొద్ద సెలవు దీసికొని గృహంబునకుం జని యాబోయఁడు తన జాయం బిలిచి

“యోసీ! నేను దినదినమును దొంగతన మొనరించి ధనము తెచ్చి మీకుఁబెట్టుచుంటిని. మీరు సుఖముగా ననుభవించు చుండిరి. ఈపనివలనఁ బాపము గలుగునని పెద్దలు చెప్పు చున్నారు. అది మనమెల్ల ననుభవించవలసి వచ్చును సుమా?” యనెను.

“చాలుచాలు! ఎవ్వరు చెప్పినారు? ఆలికిఁ గూడుపె ట్టుట యూరి కుపకారమా! కట్టుకొన్నది పట్టెడన్నము పె ట్టుటకేఁగదా? నీవు దొంగతనమో దొరతనమోచేసి పెట్టు టయు, మేము తినుటయు విధిగాని, ఆపాపమునందెంతమా త్రమును మేము భాగమును బొందువారముగాము. నీకర్మ ము నీదియే యనిన నాతఁడామెయొక్క భయాభ్రాంతుఁడై మరలి మునుల కడకుఁ బరువిడి, మహాత్ములారా! నాపుణ్య మున మీరు దర్శన మిచ్చితిరి. నాపాపము నాదియేనఁట! భార్యాపుత్రాదు లెవ్వరును బంచుకొనరఁట! నేటితో నేనీచెడువృత్తి మానితిని. ఇట్టి సంసారముభరించుట నాకేల? మీపాదములను బట్టితిని. నాకీపాపములు బోవు నుపాయము నానతియ్య వలయునని ప్రార్థించెను. అంత నామునులు కరు ణించి రామనామము “మర” యని వ్యత్యస్తముగా నాతని కిం జెప్పి యిది యెప్పుడును నీవు నోట స్మరించుకొనుచు మేము వచ్చునరకు నిచ్చటనే యుండుము. నీపాపములు నశిం చునని చెప్పి వారు బ్రహ్మలోకంబునకుం జనిరి.

ఈబోయవాఁడు వారు చెప్పినచొప్పున నామంత్రము జపించుకొనుచు కదలకుండ నచ్చటనేఁ గూరుచుండెను. శరీరమందంతటను బుట్టలుమొలచి యటనొక పెద్ద పుట్టగా నేర్పడెను.

లోకముల బాధించు రావణుఁ డెవ్వనిచే నశించునని బ్రహ్మలోకమున నారదుఁడు విరించి నడిగెను. "విష్ణువయోధ్యాధిపతియగు దశరథుని పుత్రుఁడగు రాముఁడై యాతని సంహరించును. ఇది రహస్యము. నీవు నాపుత్రుఁడవుగానఁ జెప్పితిని. వెల్లడి సేయకుము. నీవురహస్యమును డాపఁజాలవు. జాగ్రత్తసుమీ?" యని వనజభవుం డానతిచ్చుటయు, నారదుండిదినాకు బాధాకరము. ఎవ్వరికిం జెప్పకుండఁజాలను; అనుకొనుచు భూమిందిరుగుచున్నప్పు డాపుట్టకటకుంబోయి యేచెట్టునకో పుట్టకో చెప్పకుండ జాలనని యాపుట్టలో నీరహస్యము బయలుపరచెను. అదియందున్న సిద్ధపురుషుని చెవులఁబడెను. ఇంతలో ఋషులు తిరిగివచ్చుచు నటకువచ్చి, యక్కటా! మరచితిమి? చిరకాలమయినది? ఇక్కడ నొకనినుంచుమని చెప్పితిమి. ఆతఁడు మనరాకకు వేచియుండినచోటిదియగదా? ఈపుట్టలోనివాఁడ తండేగా నోపునని బ్రహ్మదండంబుల సహాయంబున నాపుట్టందవ్వి యాతనిందీసి కమండలూదకంబులఁజల్లి జీర్ణదేహంబు పుష్టంబొనరించి యప్పుడా మంత్రమును "రామ"

యని సరిగ బోధించి నీకు వాల్మీకియను నామకరణంబు చేసితిమి. పుణ్యాత్ముండవైతివని చెప్పిపోయిరి. ఆతఁడే శ్రీరామకథను శ్రీమద్రామాయణ గ్రంథముగ రచించిన వాల్మీకి.

---

## 3. లోకజ్ఞానములేని చదువునిరర్థకము.



తే॥ గీ॥ ఎంత విద్యామహత్వంబు నెఱిఁగియున్న
నెంత ధనధాన్య సంపత్తి నెనసియున్న
నెంత శౌర్యబలంబుల కిక్కయైన
లౌకికజ్ఞానశూన్యుఁ డల్పతవహించు.

ఒక గ్రామమున డబిద్ధుఁడను నొక బ్రాహ్మణ బాలుఁడు గలఁడు. ఆతని తండ్రి చాలపండితుఁడై మహారాజుల సభలయందు మెప్పునడయుచుండెను. తన తండ్రి తన్నెన్ని విధముల బోధించుచున్నను విద్యాభ్యాసము నందీ డబిద్ధునికెంతమాత్రమును శ్రద్ధకలిగినదికాదు. తండ్రి యీతని కెన్నియో నీతులను బోధించి విద్యాధికుని జేయవలెనని ప్రయత్నించు యత్నములన్నియు నిష్ఫలములయ్యెను. కాని వయోధికుఁడుమాత్రమగుచుండెను. అందుచే నెట్లయిన ముడివడినఁ జాలునని యీతనికిఁ దండ్రి వివాహప్రయత్న మొనర్చెను. తం

డ్రి కీర్తినిబట్టి యొకవిద్వత్కుటుంబములోని కన్నియ యీడబిడ్డనికి భార్యగాలభించెను. ఈతఁడొకపండుగుదినమున నాహూతుఁడై యత్తవారింటికిఁ బోవలసివచ్చెను. క్రొత్తయల్లుఁడు వచ్చినప్పుడత్తవారింటఁ జరుగు సత్కారములన్నియు నీతనికి యథావిధిగ లభించెను. పండుగునాటి పిండివంటలనారగించుటలోఁ దనయఖండ పాండిత్యమును వెల్లడించెను. మోమోటమిలేని యల్లుఁడు దొరకినందుల కత్తగారు మురియఁజొచ్చెను. మంచి పండితపుత్రుఁడనియు, పాపము నోటిలో నాలుక లేదనియు, తలలో నాలుకవలె సంచరించువనియుఁ దన్ను జూడవచ్చిన వారికడఁ దన బావమరదులు తన్నుగూర్చి చెప్పుచుండు మాటలు విని, తనకు వారుసేయు గౌరవమున కీడబిడ్డఁడు పొంగిపోవుచుండెను.

పండుగునాటి మధ్యాహ్నము తన బావమరదులుగాని, మామగారుగాని గృహమున లేనప్పుడొక మనుష్యుఁడొక యుత్తరమును దెచ్చియిచ్చెను. అత్తగారీతనిం జూచి "నాయనా! దానింజదువుమని" చేతికిచ్చెను. దాని నిటునటుఁ ద్రిప్పి దీర్ఘముగఁ జూచిచూచి కంటఁదడిపెట్ట నారంభించెను. ఈతని ముఖవైఖరిని గాంచి యత్తగారి చిత్తముమెత్తనై "యేమిబాబూ! అట్లు దుఃఖించుచుంటివి?" అని యడిగెను. ప్రత్యుత్తరము చెప్పలేడు. ఆయుత్తరమున నేదియో యశుభ విషయముండుటచేఁ దన యల్లుఁడు మాటలాడుటలేదని భా

వించి యాయిల్లాలు పెల్లున రోదనముసేయ నారంభించెను. ఇంటఁగలవారెల్ల గొల్లుమనిరి. వీధిఁబోవు వారెల్లను దెల్లఁబోయి గుమ్మముకడ నిలువఁబడిరి. ఏమది? యని ప్రశ్నించు వారి కాగృహమునుండి జవాబువచ్చుటలేదు.

ఇంతలో బావమరదు లీవృత్తాంతమును విని పరుగిడి వచ్చి యాజాబు గైకొని చదువుకొనిరి. ఆయజమానునికి దౌహిత్రుండు జన్మించినాడనియు, మాతయు, శిశువును నారోగ్యముగ నుండిరనియు, ఒక్కసారివచ్చి చూచిపోవఁ గోరుచున్నామనియు, నాజాబునందుఁ గలదు. ఎల్లరును విని తెల్లబోయిరి. వారిలోఁ గొందఱు, "ఏమమ్మా! శుభలేఖను జూచి శోకించుచున్నావు?" అని ప్రశ్నించిరి. దానికిఁ దగిన కారణము నామె వచించెను. భద్ర లేఖనుగాంచి బాష్పములు విడిచెదవేమని బావమరదులు పండితపుత్రునిఁ బరిహాసించిరి.

"నేను చిన్నతనమునఁ జదువుకొనలేదు. ఓనమాలు నాకొంటఁబట్టినవి కావు. వచ్చిన జాబునందలి వాక్యమును గూడఁ జదువఁగల భాగ్యము పెట్టిపుట్టలేదుగదా? యని విచారించితిని. నేను వీరినెవ్వరినిగాని యేమొయ్యఁగని చెప్పలేదు." అని దుఃఖింపఁ దొడఁగెను. దానికెల్లరును నవ్వసాగిరి. ఆపరిహాసమునఁ బడలేక నాఁటి తెల్లవారుజామున నాయల్లుఁ డెవ్వరికిం జెప్పకుండ వారణాసీ పట్టణమునకు దారితీసెను.

పండితుఁడనై రావలెనని పంతమువట్టెను. వినాయకఘట్ట మున విడిదిచేసెను. తదేకదీక్షతో నేకదంతు నారాధించెను. విఘ్నేశ్వరునికి విశేషానుగ్రహము గలిగినది. కలిగిన శాస్త్రములెల్లఁ గరతలామలకములైనవి. రాజసభలలోనికి రాకపోకలేర్పడెను. విద్యార్థులు విరుగఁబడి రాజొచ్చిరి. పాండిత్యముఁ జూపి బావమరదులఁ బరాభవించుట పరమపు రుషార్థముగ భావించి విద్యార్థుల వెంటనిడుకొని యత్తవారిం టికిఁ బయనమయ్యెను. ఈతఁడిట్లు వచ్చుచున్నాఁడనువార్త నెఱింగి బావమరదు లిట్లూహించిరి. ఈతఁ డెంతచదివినను లోకజ్ఞానముసున్న. విద్య మధ్యవచ్చినదిగాని జ్ఞానశూన్యత స్వాభావికమయినదియేగదా? ఒకమార్గమున నితని బరాభ వింప వలెనని యాలోచించి యాతని కెదురుగాఁ గొంత దవ్వరిగి లేనిదుఃఖము దెచ్చుకొని గోలుగోలున నేడ్చుచు నాతనికెంటఁ బడిరి. దానికాతఁడు విభ్రాంతుఁడై "ఓయీ! ఏమి కష్టము సంభవించినది?" అని ప్రశ్నించెను. దానికి వారు, "బావా! నీభార్య ముండమోసినది." అని మఱియు నేడ్వ నారంభించిరి. "అయ్యో! ఎంత దురదృష్టవంతుఁడను. ప్రేమా స్పదురాలగు నాభార్యకెంత విపత్తు తటస్థించినది. ఆ యమం గళమగు మగువ మొగంబు నేనెట్లు కన్గొందును. హా దైవ మా!" యని డబిద్ధపండితుఁడు విలపింపఁ జొచ్చెను. ఆవిలాప ము నాలకించి బావలు నవ్వాచుకొనఁజాలక యేడ్పును

నవ్వుగా మార్చుకొని పకపకలాడిరి. "ఏమిది? మీకు పరిహాసమా? మీతోఁడబుట్టువునకుఁ గలిగిన యాపద మీకుఁ గాదా? చాలు చాలు, మీపరిజ్ఞానమింత యథార్థమ్ముగ నున్నది." అని వారిని మందలింపసాగెను. "బావా! నీవుండ నీభార్య ముండమోయుట యెట్లు?" అని వారడిగిరి. దాని కాతఁ డిట్లనియె. "ఇదియా? మీకుఁ గలిగిన సందియము? ఎంత జ్ఞానశూన్యులైతిరి? నేనుండఁగ నాయక్క ముండ మోయలేదా? లోకమునం దెందఱు నేనుండగా ముండమోయుటలేదు? అట్టి నాభార్యమాత్ర మేలఁగారాదు? దీనికిఁ గూడ వింతయేనా?" అనుటయు వారీతని తెలివి యింతటిదేఁ గదా? యనుకొని యోదార్చి యింటికిం గొనిపోయి యీతనిధర్మపత్నిం జూపి సంతోషపఁజేసిరి.

---

# 4. దైవబలములేనివానికి జయములేదు.

—:0:—

తే. గీ. ఎంత బలిమియున్న నెంతసాహసమున్న
నెంతవిద్యయున్న నెట్టిసేన
గలిగియున్న,జనుల కసలేదు జయము
దైవబలములేక దప్పదేని।

కౌరవపాండవ యుద్ధానంతరము బంధువుల జంపిన

పాపము దొలగించుకొనుటకు ధర్మనందను డశ్వమేధ యాగంబుఁ జేయ దలపెట్టెను. యజ్ఞాశ్వమును భూమి నలు దిక్కులం ద్రిప్పికొని వచ్చుటయు, నశ్వము నడ్డువచ్చిన రాజుల జయించి గుఱ్ఱముం గొనితెచ్చుటయు, నట్టిపనికి సమర్థుఁడగువాని నాహాయము వెంటఁ బంపుటయు నాచార ము. కావున నాయశ్వరక్షణమునకు సమర్థులగు కృష్ణార్జును ల ధర్మజుఁడు నియమించెను.

అర్జునుఁడు తనకుఁ గృష్ణసహాయము గౌరవమున కుఁగొంత భంగము గలిగించుచున్నదనుకొని యాపనికి నే నొక్కఁడంజాలుదును. బావగారిని సేదదీర్చుకొననిమ్ము. ఆయనసహాయము నాకక్కఱలేదనినిరాకరించెను. కృష్ణుఁడు నేనును వచ్చెదనని యుత్సాహముఁజూపెను. అందుల కిష్టము లేకున్నను మోమోటమిచే నెట్టకేల కర్జును నంగీక రింపకఁ దప్పినదికాదు. ఒక శుభముహూర్తమున నయ్యశ్వ మువెంటఁ గృష్ణార్జునులు కదలి నడచుచుండిరి. గుఱ్ఱమొక యరణ్యమార్గముఁబట్టి గొంతదవ్వరిగెను. మనపేరు విన్నం తనే భయభ్రాంతులగు రాజలోకమున నెవ్వఁడు మన యశ్వము నడ్డగింప గలఁడను గర్వముతో నర్జునుఁడు కృష్ణు నితో సల్లాపములాడుచు గుఱ్ఱమునకు వెనుక దవ్వుగ నడచు చుండెను.

ఇట్లుండ నయ్యడవి నశ్వము వేటకై యిర్వురురాజ

పుత్రులు నడయాడుచు సవనాశ్వంబుం గాంచి సమీపంబు నకుం జని దాని ముఖభాగమునఁ గట్టఁబడియుండు పట్టముం జదివిరి. అందిట్లు వ్రాయఁబడియున్నది.

ఉ॥ "దుర్జయరాజమండలవిఘుంతుఁడమూర్తి యుధిష్ఠిరక్రతూ
త్సర్జితమైన యీహయవతంసము ద్రిమ్మర నంగరక్షగా
నర్జునుఁ డేగుదెంచె, నిటలాక్షుని గెల్చినజోదు, విక్రమో
పార్జితలీలఁ బట్టుకురయంబున శూరులు ధాత్రిఁ గల్గినన్॥"

[జైమినిభారతము]

అర్జునుఁడఁట! నిటలాక్షుని గెల్చినాఁడఁట! ఈతని పరాక్రమము చూడఁదగియున్నది. అని గుఱ్ఱము నచ్చట బంధించిరి.

క్రమముగాఁ గృష్ణార్జును లచ్చటి కేతెంచిరి. ఆరాజపుత్రులం గాంచి మీ రెవ్వరని ప్రశ్నించిరి. గుఱ్ఱము బట్టుటకుం దగిన కారణ మేమని యడిగిరి. అయోధ్యాపురమున బాలించు మయూరధ్వజ మహారాజపుత్రులము. తామ్రధ్వజుఁ డనియు, నకులధ్వజుఁ డనియు మమ్ముం బిలిచెదరు. ఇది సవనాశ్వమగుటచే దీనిం గొనిపోయి యయ్యజ్ఞఫలంబు మాతండ్రి కొసంగి ప్రాణము నిగఁదలంచితిమని వారు వచించిరి.

అర్జు:—మీరు వయసులోని వారగుటచేఁ గార్యాకార్యము లెఱుంగక యాచరించిన యీపనికి మేము కిని యందగదు. హితమును బోధించు నామాటలనాల

కింపురుషు. ఇయ్యశ్వము సులభసాధ్యముగాదు. దీని ముఖంబునందలి పట్టముం జదువుకొనిన నిట్టిపని మీరాచరించియుండరు. కావున నీహయంబు విడువుండు.

తామ్ర:-అర్జునా! నిన్ను మేము వినుకలిచే నెఱుంగుదుము. కావుననే నీతోఁ బోరి గెలిచి యీతురంగముతోఁ బాటుయశంబుంగూడఁ గైకొని పోవయత్నించితిమి. ఈ హితోపదేశంబులవలన నీకుంగల ప్రయోజనంబులేదు.

నకు:—రుద్రునిగెల్చిన వానికీభద్రోపదేశములేల? చాలినంతవరకు కాలమొసర్చు మమ్ముం దూలించినప్పుడెజాలిం గనఁబఱచెదవు లెమ్ము. జయాపజయము లీశ్వరాధీనములు! నీకర్తవ్యమునకు రమ్ము.

అర్జు:-బావా! చూచితివా? వీరియజ్ఞానము?

కృష్ణు:-అజ్ఞానమో సుజ్ఞానమో? నీ కర్తవ్యము నతిక్రమింపరాదుగదా?

అర్జు:-ఏమి? యుద్ధమాచరింపుమందువా?

కృష్ణు:-అది నీధైర్యము!

అర్జు:-పసివారితో సమరమొనర్చుట యేటిపోటరితనమని శంకించుచుంటిని గాని ధైర్యములేక గాదు.

కృష్ణు:-అయినచో నశ్వమునువీడి పోవుదము రమ్ము.

అర్జు:-నవనభంగముకాదా?

కృష్ణు:-అయినచో నితరచింతల. దొలగించి సమరంబునకుఁ

గడంగుము. దీనికింత యాలోచనమేల?

అర్జు:-రాజపుత్రులారా! మీరు మీయత్నమును విడువరా?

రాజపుత్రులు:-ముమ్మాటికిని విడుచువారముకాము.

అంతటఁ దామ్రధ్వజునికిని బార్థునికిని జిరకాలము యుద్ధము జరిగినది. అర్జునుని బాణపరంపరలు తామ్రధ్వజుని రణరంగమునఁ బడగొట్టుటయు నకులధ్వజుఁడు కనలి సమరమునకుదిగి యర్జునుని నిరువదినాల్గు బాణంబులం బడఁగొట్టెను. పాండవసేనలు నలుదిక్కులకుం బాఱి జొచ్చెను. అర్జునసహాయం బొనరింపంబూని యాలంబునకుం గడంగిన గోపాలుందలపడి నకులధ్వజుండు ప్రచండ మార్తాండునిరీతినివిక్రమించినంగొంతవడికిఁ గృష్ణుండుగూడ మూర్ఛాయత్తుండయ్యె. ఇంతలోఁ దామ్రధ్వజుండు తెలివింగని పాండవ పక్షుంబున నధ్యక్షుండు లేమింజేసి యయ్యిరువురు నశ్వంబు నధిష్ఠించి తమ పురంబునకు వాయువేగంబునం జని తండ్రికయ్యజ్ఞీయహయంబు నర్పించి మెప్పువడసిరి.

ఇంత నిక్కడ నడవి నమునఁబడిన కృష్ణార్జునులు తెలివింగని లేచిరి. అర్జునుండు విచారాక్రాంతుండై కృష్ణునింగాంచి బావా! యజ్ఞహయంబు చేఁదప్పె. కర్తవ్యమాలోచింపవలయు ననియెను.

కృష్ణు!-ఆలోచించుట కేమున్నది? ఆరాజపుత్రులను యాచింప నిచ్చగింతువా?

అర్జు:-అది క్షత్రియధర్మమగునా?

కృష్ణు:-ఇది క్షత్రియధర్మమా! యేమి? ఎట్లో కార్యమును సాధింపవలయుంగదా?

అర్జు:-అట్లయిన నీచిత్తము. నీవెట్లుచెప్పిన నట్లు నడచు కొందును.

కృష్ణభగవానుఁడొక వృద్ధబ్రాహ్మణరూపము ధరించి యర్జుననొక విద్యార్థివేషము వేయించి యయోధ్యకు బయలుదేరెను. ఆపట్టణమందు రాత్రిసమయమునం బ్రవేశించి పురజనులకుఁ దనయందుఁగల భక్తివిశ్వాసముల నర్జునునకుఁ జూపి యర్జునా! నేను నీకడనే యుంటినని తలంపకుము. అంత రంగికభక్తులకడ నుందునుగాని నేను వేరొకచోటనుండు వాఁడనుగాను. నేనెల్లప్పుడు నిచ్చటనేయుందును. ఈరాజు సుగుణంబులఁగూడఁ జూచెదవు లెమ్మని మరునాటి వేకువఁ గాల్యకృత్యముల నిర్వర్తించి శిష్యసహితుండై యామాయా విప్రుండు రాజభవనంబునకుంబోయి రాజు నాశీర్వదించెను. అంత నామయూరధ్వజుండు సంభ్రముండై లేచి వారి కర్ఘ్యపాద్యాదుల నొసంగి పూజించి రాఁగతంబేమని ప్రశ్నించెను. అంత నావృద్ధభూసురుండిట్లనియె. రాజా! నీవు ధర్మాత్ముండవని వింటిమి. మాకొక గొప్ప యాపద సంభ

వించినది. నా యేకపుత్త్రిని వివాహంబునకుఁ బోవుచుండ మార్గమధ్యంబున నొక యాఁకొన్నసింగంబు నా కొమరునిం బట్టి వధింపఁ బూనుటయు, నేను ప్రార్థింప నీశరీరమాంసంబుం దెచ్చియిచ్చిన విడిచెదనని నుడివినది. కావున నాకుఁ బుత్త్రిదానమొనర్చిన పుణ్యముం గట్టుకొనుము. నావుడు నారాజ చంద్రుండు తనమేను బ్రాహ్మణప్రాణరక్షణార్థము వినియోగపడుటకుఁ గడుంగడు సంతసించి యవశ్యము మీకోరికను నెరవేర్చెదను. ఇదే వచ్చుచున్నాఁడనని లేవఁబోవ నామాయాభూసురుం డిట్లనియె. భూపాల శిరోమణీ! యింకొకమాట చెప్పమఱచితిని. నీశరీరములో సగముభాగము స్త్రీకి సంబంధించినదఁట. అయ్యది దానికిఁ గిట్టదఁట. వృద్ధదేహమును, స్త్రీదేహమును దానికంగీకారము లేకుండుటచేతనే మానవధూవరు లీసింగమునకుఁబనికిరాలేదు. కావున నీశరీరమును సగము అంపమునఁగోసి తేవలెనన్నది. అట్లాచరించి నాయభీష్టముందీర్చిన శాశ్వతయశంబు గడింపుమనియెను. అయ్యా! నాకు యశోభిలాషకంటె భూసురప్రాణసంరక్షణాభిలాషయే మెండు. కావునమీయభిమతముఁ జెల్లించెదనని క్రకచముం దెప్పించి, తన శరీరముం గోయుమనాజ్ఞయొసంగెను. అదివిని యాదుష్టవిప్రుండు రాజపుత్రులగు తామ్రధ్వజ సకులధ్వజుల నాఱంపముం బట్టుఁడనియు, రాజపత్నిని శిరముం బట్టుమనియు నియమించెను. కనులనీరు

గ్రిమ్మకొన రాసుతులు అంపమునఁ దండ్రితలఁ దఱుగు చుండిరి. రాజు నెడమకంట బాష్పంబులు రాలఁజొచ్చెను. అదిగని యమ్మాయాభూసురుండు, తత్క్షణమే లేచిపో యెను. రాజదికాంచి పుత్రునింబనిచి రావించి యయ్యా! ప్రాణావశిష్టుండనైన నా కుభయలోకసుఖంబు నశింపఁ జేసి తామీదానము నంగీకరింపక లేచి వెడలుటకుఁ గతంబేమని దీనుండై పలుక నావిప్రుఁడు రాజా! యేడ్చుచునిచ్చు నీదాన మెవ్వరికిఁ గావలయును? దాత యాచకునికిఁ దానిచ్చు నర్థంబులు సంతోషపూర్వకంబుగ నొసంగునేని గ్రహించిన వాఁడుగూడ దృప్తిగ ననుభవించును. లేదా? ఆదాన ముభయులకుంగూడ ఫలమునొసంగజాలదు. నీవిట్టివాఁడవని యెఱుంగకవచ్చిన నాయజ్ఞానమునకు నాకే సిగ్గగుచున్నది. నావుడు నావదాన్యచక్రవర్తియిట్లనియె. "అయ్యా!ఇదియా? మీసందియము? కుడిభాగము బ్రాహ్మణవినియోగమగు చుండ నాకాభాగ్యము లభించినదికాదుగదా? యని యెడ మభాగము విచారించు చున్నది. కాని బాధచేఁగాదు. అట్ల యిన నుభయ నేత్రములయందును బాష్పము లేలరారాదు? స్వామీ! అల్పావశిష్టజీవనుండనగు నన్ను మన్నించి యీ దానఫలంబు నాకు దక్కనిండని ప్రార్థింప నంతట గరుడ వాహనారూఢుండై చక్రాద్యాయుధంబుల ధరించి శ్రీహరి యర్జునునితోఁ బ్రత్యక్షమయ్యెను! రాజు దేహంబునంటి

హస్తపుస్తక సంయోగమొనర్చి నజరిదేహముఁ గొనరించెను. తమవృత్తాంతంబెల్ల నాభూపాలున కెఱింగించెను. మయూరధ్వజుండును వారలకు నమస్కరించి స్తుతించి, తన తనయుల యవినయంబునకు గర్హించి, వారి నవనాశ్వంబును వారి కొసంగి సవినయ గౌరవంబుగ వారిని బంపివేసెను. దైవబలంబుం దోసిపుచ్చి కృష్ణసహాయంబు నిరసించి పౌరుషమును బ్రధానమనియెంచిన నాకపజయము గలిగినదికదా? యని యర్జునుండు, దైవబలముగలవాఁడే విజయముం బొందుననియు, నదిలేనివాఁడు జయింపఁజాలఁడనియుఁ జెప్పిన పెద్దల సిద్ధాంతమును దన శుద్ధాంతరంగమున నమ్మియుండెను.

---

# 5. బుద్ధిమంతుని మైత్రి, కార్యసాధకము.

—•—

తే॥ గీ॥ కామితంబుల నొడఁగూర్చు కల్పకంబు,
విపులసంపదల నొసంగు వేల్పుగిడ్డి,
యనుపమార్థ ప్రదంబగు నమరమణియుఁ,
దెలివిగల మిత్రునికిఁ గొంచెకీసె పోవు.

ఒక యగ్రహారమున దేవశర్మయను నొక బ్రాహ్మ

ణుఁడు గలఁడు. ఆతఁ డాగర్భదరిద్రుఁడయి భిక్షాటనము సేయుచుండువాఁడు. వయసున నేబదివత్సరము లతిక్రమించిన దృఢశరీరి. ఎట్లయిన వివాహమొనర్చుకొని తీరవలయు నను నాసమాత్రము వయసుతోఁ గూడఁ బెఱుఁగుచుండెను. ఆతనికి సుబుద్ధియను నొక్కమిత్రుఁడుగలఁడు. తన పరిణయముంగూర్చి దృఢయత్నమొనర్చి పున్నెముగట్టుకొనుమని యాతఁడు తనమిత్రు ననేకవిధములఁ బ్రార్థించెను. సుబుద్ధి యందులకియ్యకొని యాతని దనవెంట నిడుకొని కుతపకాలమునకొక పల్లియం జేరి యొక బ్రాహ్మణగృహమున కేతెంచెను. ఆగృహస్థుండు వీరలఁ బూజించి యాతిథ్యమొసంగెను. కుడిచి కూర్చుండి యిష్టసల్లాపములఁ బ్రొద్దుపుచ్చుచు నాగృహస్థుని సుబుద్ధి యిట్లు ప్రశ్నించెను. "అయ్యా! మీ కెందఱు సంతానము?"

గృహస్థుఁడు:-ఇద్దఱాఁడుబిడ్డలును, నొక పుత్త్రుఁడును గలరు.

సుబుద్ధి:-ఆఁడుబిడ్డలె పెద్దవారా?

గృహ:-అవును.

సుబు:-ఇద్దఱకును వివాహము లొనర్చితిరా?

గృహ:-పెద్దబిడ్డకుఁ బరిణయమైనది. రెండవబిడ్డయు వివాహానయుక్తయైనది.

సుబు:-సంబంధ మాలోచించితిరా?

గృహ:-అందులకే చాలశ్రమపడుచుంటిని. అనుకూలసంబంధ మెచ్చటను లభించుటలేదు.

సుబు:-మాయూరనొక సంబంధమనుకూలమయినది కలదు.

గృహ:-వరుని వయసెంతయుండును.

సుబు:-ఎంతయననేల? నావెనుకవాఁడే.

గృహ:-(తనలో) ఈతనికి ముప్పది వత్సరములుండును. ఆతని కిరువదియైదు వర్షములైన నుండియుండ వచ్చును. ఈతని వెనుకవాఁడేగదా? (ప్రకాశముగా) అయ్యా! వయసుమాకు నచ్చినది. ఆతని కేమయిన భూమికలదా?

సుబు:-దానికిలోపమేమి? కావలసినంత యున్నది.

గృహ:-పశువులమాట?

సుబు:-దానికేమిలోపమయ్యా! ఇంటిలోను బహువే. వీధిలో నుబహువే.

గృహ:-బంధుబాహుళ్యముగలదా?

సుబు:-అయ్యో! ఊరుననందఱు నాతనికి బంధువులే.

గృహ:-అయ్యా! తాము మాపుణ్యవశమున దర్శనమిచ్చితిరి. సంబంధము వెదకఁజాలక వేసరుచున్నాను. ఈవిషయమున నాసంబంధము నెట్లయినఁ గుదిర్చి నాకు సహాయపడఁ బ్రార్థితులు.

సుబు:-అయ్యా! సంబంధమన్న మాటవలలోలేదు. మీరు

వచ్చి విమర్శించుకొనవలయుఁగదా?

గృహ:-మీరు సద్బ్రాహ్మణులు. మీ మాటయేనాకు నమ్మకము. ఇతరాలోచనముసేయను. తాము స్వగ్రామమున కేగి వారితో ముచ్చటించి నాస్థానమున మీరే సకలమును నిర్వర్తించి పరిణయముహూర్తమును నిర్ణయించి పెండ్లివారితోఁ దరలిరాఁగోరుచున్నాను.

సుబు:-సరియే,

అని తనస్నేహితునితో నింటికిఁ బోయి సంబంధము కుదిరినదనియు, నాలుగు దినములకు ముహూర్తమనియు, వచ్చుచున్నామనియు,వార్తనంపెను. కన్యాదాత, తనయత్నములోనుండెను.

పెండ్లికుమారునికి గోదాంతాదిస్నాతకవ్రతనియమములం దీర్చి మంచి దుస్తులఁ గట్టనిచ్చి కొందఱు మిత్రులం గూడ నిడుకొని, సుబుద్ధి పెండ్లికిం దరలి వెడలెను. వచ్చిన పెండ్లివారిని గన్యాదాత గౌరవించి విడిదియందుఁ బ్రవేశంబు సేయించెను. చూచిన కొందఱు వరుఁడు వయోధికుండనిరి. వచ్చినవారిని బొమ్మనిన నిఁక బిడ్డకు సంబంధము కుదురుట దుస్తరమనియు, దినుట కన్నము గలదుగదా? యనియు, నాకన్యాదాత తన ధర్మపత్ని నోదార్చి సాలంకృత కన్యకాదాన మొనర్చెను. మనుగుడుపుల కల్లునింటి కెల్లరుంబోయిరి. కన్యాదాత సుబుద్ధింజూచి, అయ్యా! ఈ

తని భూములెక్కడ? యని ప్రశ్నించెను. ఇది భూమి. అది భూమి. అంతటను భూమియే. ఇప్పుడు మీరు భూమిమీఁద లేరా? యని సుబుద్ధి పలికెను.

గృహ:-అయ్యా! వరుని వయసు మిమ్ము నే నడిగినప్పుడు మీ వెనుక వాఁడంటిరి. భూమి విషయమిట్లు చెప్పితిరి. ఇట్టి యసత్యము తగునా?

సుబు:-నే నసత్యమాడిన దొక్కలేశమును లేదు. అప్పుడీ వరుఁడు నా వెనుకఁ గూర్చొనియుండ లేదా? భూమిని మీరడిగినపుడు కావలసినంత యున్నదంటిని. నే నాడిన యసత్యమేది?

గృహ:-సరియే. నేనే బుద్ధిహీనుఁడను. ఇఁక నీతని పశుధనముమాట యేమి?

సుబు:-నామాటల నసత్యములేదు. ఇంటిలోను వీధిలోను బశువేయంటిని. ఈవరుఁ డట్టివాఁడే. ఇంకను మీరు విచారించుకొనవచ్చును.

గృహ:-పోనిండు. ఏమిచేయుదుము? కష్టములకు సాయపడు బందుగులున్నారు గదా?

సుబు:-భిక్షాటనము సేయువాని కెల్లెడలను బందుగులే.

గృహ:-అల్లుని యుద్యోగమునుగూడ సెలవిచ్చితిరా?

సుబు:- ఉన్నది యదార్థము సెప్పుట సజ్జనుల ధర్మము. కావున దాపకఁ జెప్పితిని. మీ రేమనుకొన్న నేమి?

నాపరమార్థమునకు లోపముండదుగదా?

అంతట నాగృహస్థుఁ డల్లునిగూడఁ దన యింటికిం గొంపోయి తన ధనమునఁ గొంతభాగ మాతని కొసంగి, యెద్దియేని వృత్తిఁ గల్పించి వృద్ధికిం దెచ్చి కాపాడెను.

---

# 6. తృప్తిలేనివానికి దుఃఖము తప్పదు.

—:0:—

తే॥ గీ॥ ప్రాప్యమగు ధనమడవిలోపలను వచ్చు
నంతకధికంబు మేరువందైనరాదు
కానమనుజుండు తృప్తిని గనుటలెస్స
యద్దిలేకున్న దుఃఖించు ననవరతము.

మందరమను పేరుగల యొక యగ్రహారమునందు హరదత్తుఁడనఁబడు నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁ డాగర్భదరిద్రుఁడగుటచేత భిక్షాశముచే జీవయాత్ర సేయుచుండెను. సంసారభారమాతని కొక్కింతయు లేదు. కావున వేళకుఁగలదానిని భుజించి సాయంకాలమగునంత నొక శివాలయమునకుఁ బోయి యీశ్వరదర్శన మాచరించి యాలయమంటపభాగమునఁ గూరుచుండి శివునిపైఁ గీర్తనములఁ బాడుకొనుచు ననుదినమును భగవదారాధనమునఁ

గాలక్షేపము సేయుచుండువాఁడు.

ఇట్టి యాహారదత్తుని యీశ్వరధ్యానావసరమునఁ బాడఁబడు కీర్తనముల కనువగు కరతాళముల సందర్భమున నొకనాటి సంధ్యాసమయమున నొక కాకి యాతని చేతులలోఁ జిక్కుకొనెను. ఏమి? యీ పవిత్రసమయమున మాలకాకిని స్పృసించితిని? అని విడువఁబోవునంతలో నొక వైపునుండి "యోయి బ్రాహ్మణుఁడా! ఆవాయసమును విడువకుము. అది నీదరిద్రముం బాపఁగలదు." అని కేక యొకటి వినవచ్చెను. ఇదియేమి? అని యీతఁడాలోచించు చుండ నొక రాజభటు డచ్చటికి వచ్చి యిట్లనియె. అయ్యా! ఈదేశాధిపతియగు చంద్రగుప్తుని దూతను. అతఁడొక దినమున వనవిహారము చేయుచుండఁ బక్షుల కలకలధ్వని శ్రవణానంద మొనర్ప లోకమునందలి పక్షులలో జాతికొక్కటిని బట్టించి పెంపవలయునని కుతూహలము జనించి యీ పనికి మమ్ము నియోగించెను. లోకమునందలి పక్షులలో జాతికొక్క పక్షిని బట్టుకొంటిమి. కాని కాకి మాత్రము లభించినదికాదు. ఇది రాజున కెఱింగించితిమి. ఆకాకినిబట్టిన వానికి లక్షరూప్యముల నొసంగెదనని దేశమునఁ జాటనంపెను. ధనాపేక్షచే నేనును దిరిగితిరిగి, విసివి వేసరుచుంటిని. అది నీకు లభింపనున్నది. కావున జేపకడ లేచి రాజసభకీ వాయసముం గొనిరమ్ము. నీకు లక్ష్యరూప్యంబులు

లభించుననని యారాజభటుఁడు చెప్పి పోయెను.

అంత నీహారదత్తుఁ డీశ్వరధ్యానమును మఱచి యీధనము నెట్లు వినియోగింతునా? యను నాలోచన మందు మగ్నుఁడయ్యెను. "ఒక లక్షరూప్యములు నాకు లభించుచున్నవి. దానిచే లక్షాధికారియను పేరునాకుఁ గలుగును. వీనిచే నేను విశేషసుఖముఁ బొందగల్గుదును. ఈశ్వరసేవ రిక్తమోవునే? ఈ ధనమునందలి నాల్గవభాగమును నా వివాహంబునకును, మఱియొక నాల్గవపాలు సౌధంబునకును వ్యయపెట్టకఁ దీరదు. ఇఁక నిలువయుండు ధనమేబదివేలు. దానిచే లక్షాధికారియను బిరుదము పోవును. అయ్యో! ఇదియు, విచారకారణమయినది. ఇంకొక్క లక్షరూప్యంబులు లభించునేని యవి వడ్డికిచ్చుచు నీ మిగిలిన ధనము నింట నిలువఁజేసికొనవచ్చును. అయ్యో! దైవమా! ఇచ్చినవాఁడవు పూర్తిగా నొసంగక సగముచేసితివేమని" విచారించి యొక యుపాయమును దలంచుకొని యిట్లాలోచించెను. ఒక కాకమున కింత ధనము దొరకినది. ఇంకొక వాయసము లభించిన నిఁకమఱింత ధనము దొరకునుగదా? యని యూహించి తిరిగి భజనసేయుట కుంకించి యాకాకిం జంకనిడుకొని పైకిఁ జేతులెగురవేయఁగా నాయేకాకి యెగిరిపోయెను.

అంత నాహారదత్తుఁడు "శివ! శివా! యెంత బుద్ధిహీ

నుండను? నిశ్చలచిత్తముతో శివనామామృతమును గ్రోలుచు నానందమయుఁడనగు నాకీయాశ యెంతసుఖమును గలిగించినది? ధనేషణము ప్రమాదకరము." అని మనసు ద్రిప్పుకొని యీశ్వరధ్యానమునఁ గాలము గడపి తుదకుఁ బరమపదము నలంకరించెను.

---

# 7. బిడ్డల చెడ్డతనమునకుఁ దలిదండ్రులే కారణము.

కం॥ బిడ్డల చెడ్డగుణంబుల
కడ్డము సెప్పకయు, వారి కమితోత్సాహం
బిడ్డ, తలిదండ్రులెల్లరు
బిడ్డలకును శత్రులనుట వృథగాదనుఁడీ।

చోళదేశమున సిరిపల్లెయను నొక చిన్నపల్లెటూరు గలదు. అందు గోపాలుఁడను పిల్లవాఁ డొకఁ డుండెను. ఆతఁ డెన్నఁడును బడికిఁబోయి యెఱుఁగఁడు. ఓనమాలైనను వానికొక్క యక్కరమైనరాదు. అతనికిఁ జిన్నతనముననే తండ్రి గతించుటచే విద్యాభ్యాసమున సహాయపడువారు లేక పోయిరి. వాఁడు దినదినమును బ్రాతఃకాలమున నిద్రలేచి బయటికి బోయి జాము ప్రొద్దెక్కునప్పటి, కింటికిఁ జేరా

యో? యేబచ్చలి యాకులో, యేవంగకాయలో సంగ్ర హించుకొనివచ్చి తల్లికిచ్చుచుండువాఁడు. అందులకు వాని తల్లి యుల్లమున సంతసించి "మా నాయనకు సంసారము మోసిన"దని వానిని బొగడుచు వాని కేబెల్లపుముక్కయో యే యరటిపండో, ఫలహారము వెట్టుచు ముద్దువెట్టుకొనుచుండెడిది. తలిదండ్రులచే మాటిమాటికిని మందలింపఁబడుచున్న యొరుల బిడ్డలంగాంచి వాఁడును వాని తల్లియుఁ దమకుసాటిరారని నవ్వుకొనుచుండిరి, ఇట్లు కొంతకాలము గడచునప్పటి కీగోపాలుని కనేకుల దుస్సహవాస మేర్పడినది. చుట్టత్రాగుటయు, జూదమాడుటయుగూడ నితనిని దమంతటఁదామువచ్చి వరించినవి. దొంగతన మీాత్రనికిఁ జన్ననాటివిద్యయే. రోజున కేగంటకాలమో యీాతఁడింటి యొద్దనుండువాఁడు. బయట నీతఁడు తిరుగుచున్న వేళల యందు సంసారము దిద్దుకొను యత్నమున నే యీాతఁడు మగ్నుఁడై యెండనకఁ గొండనకఁ దిరుగుచున్నాఁడని తల్లి యీాతని శ్రమమునుగూర్చి విచారించుచుండెడిది. ఇంటి కడకువచ్చినప్పుడు వీఁడు తన తల్లియొద్దఁగూర్చుండి యేవియో పొరకాయకోతలు గోయుచుండువాఁడు. తన చెడు నడవడిని దల్లికడ బయలువెట్టువాఁడుకాఁడు. తల్లి గుమ్మము దాఁటని యిల్లాలగుటచేఁ దన తనయునిగూర్చి ప్రజలు చెప్పుకొనువార్త లామె చెవులఁబడుట యరుదయ్యెను. తన

B. Venkateswara Rao.



వాఁడు దుండగీఁడగుచున్నాఁడని తనకు బోధించు నాఁడు వారిమాటలయం దామెకు విశ్వాసములేక తన కొమరుని సుగుణముల వేనోళ్ల వారికడఁ బొగడుచుండెడిది. ఆతనికిఁ దల్లి వివాహ మొనర్పఁ బ్రయత్నముచేసినది. కాని యీతని గుణగణములు బంధుగులలో వెల్లడియగుటచే నెవ్వరును వీరి యింటికివచ్చి పిల్లనిచ్చెదమన్నవారు లేకపోయిరి. తన యాప్తులతో నీమె పరిపరి విధముల నీతని వివాహవిషయమై ముచ్చటించుచుఁ గన్యకలుగలచోటులకు వార్తలంపుచుండెడిది. కాని యీపె ప్రయత్న మెంతమాత్రమును గొనసాగినదికాదు. పుత్రుని పరిణయవిషయమున నీమెవిచారించుచుండుదినములలో నొకనాఁడాసమీపపట్టణాధీశ్వరునియింటిలోఁ గొందఱు చోరులు కన్నమునఁ ద్రవ్వి ధనమును విశేషముగ దొంగిలించుకొనిపోయిరి. ఈవార్త యచ్చటివారి కెల్లరికును దెలియవచ్చినది. ఆపల్లెయందలి వారీ పనిలో మన గోపాలుఁడుగూడ నుండవచ్చునని శంకించిరి. కాని గోపాలుఁ డాదినమున నింటికిరాలేదు. వేళకు భోజనమునకు రాకపోవుటచేఁ దల్లి యెఱిగినవారిని, మా వాఁడు మీకుఁ గనుపడినాఁడా? యని ప్రశ్నింపసాగెను. కాని యెవ్వరు నాతని యునికిని జెప్పినవారు గానరైరి. భోజనపువేళ యతిక్రమించినది. తల్లికి మనసున కళవళ మెచ్చెను. విచారించుచు వీధి గుమ్మముకడ నిలుబడి

యున్నది. అంతట నొక రక్షకభటుఁడువచ్చి యేమమ్మా! గోపాలుఁ డింటిలో నున్నాఁడాయని యడిగెను. అందుల కాయిల్లాలిట్లనియె.

ఇల్లాలు:-నాయనా! లేఁడు.

భటు:-ఎక్కడకు వెళ్లినాఁడు?

ఇల్లా:-అదినాకుఁ దెలియదు.

భటు:-ఎప్పుడు వెళ్లినాఁడు.

ఇల్లా:-నిన్న.

భటు:-ఉదయముననా? మధ్యాహ్నమా?

ఇల్లా:-మధ్యాహ్నము.

రాజభటుఁడు తిరిగి వెడలిపోయెను. అతని జూచుట తోఁడనే యీమెకు మఱింత విచారమును భయమును గలిగెను. ఇంట నేపనియుఁ దోఁచుటలేదు. కుమారునివార్తఁ జెప్పువా రెవ్వరు గానరారు. ఎట్లో ఆదినము గడచిపోయి నది. తెల్లవారినది. గోపాలుని రాజభటులు బంధించి రాజ ద్వారమునకు గొనిపోవుచున్నారనువార్త యాపల్లె జనుల యందు వ్యాపించినది. క్రమముగా నీమె చెవింబడినది. నిశ్చేష్టురాలయ్యెను. కన్న కొడుకుగుటచే విచారముం బట్ట లేక బిగ్గరగ రోదనము సేయుచు దగ్గఱనున్న యాపట్టణ మునకుఁ బోయినది. రాజద్వారము సమీపించినది. భటు లచే నిర్బంధింపఁబడియున్న కుమారుని జూచినది. ఈచౌర్య

మున కాతఁడే మొనగాఁడని చెప్పుకొను మాటలను విని కొడుకుచెంతకుఁబోయి యేడ్చుచు "తోఁటకూరనాఁడైనఁ జెప్పవైతివేమిరా! కొడుకా" యని యేడ్వసాగినది. అంతట గోపాలుఁడు రాజభటులంగాంచి "మాయమ్మతో నొక మాట చెప్పవలసియున్నది. శిక్షితుఁడనగు నాయీకోరికఁ జెల్లింపుఁడు" అని ప్రార్థించెను. వారు దాని కంగీకరించిరి. అంతట నేదియో చెప్పువానివలె తల్లి చెవియొద్దకుఁబోయి కటుక్కున నామె చెవిముక్క యూడిపడునట్లు కొఱికెను. అయ్యో! ఇదేమిరా! యని యామె మఱింత యడలసాగెను. ఓరి దుష్టుఁడా! ఇదేమి పాపమురా! యని యచ్చటివారు ప్రశ్నించిరి. "ఇది యామె పాపము. నాపాపముగాదు. నాకీ దురవస్థ యామెవలనఁ గలిగినది. చిన్నతనమున నేను చేయు తోఁటకూర దొంగతనము నాఁడే యామె నన్ను శిక్షించి యుండిన నాకీదుండగము కలుగక పోయెడిది. ఈ చౌర్యము నందు నాఁడు నా కుత్సాహము కల్గించి నన్నిట్టి కష్టముల పాలుచేసిన యీమె నాతల్లి యెట్లగును. పరమశత్రుస్వరూపిణి. కావున నీమె దోసమున కీశాంతిచేసితిని." అని గోపాలుఁడు చెప్పెను. అచ్చటివారందఱు నవ్వసాగిరి. కొందఱు గోపాలుఁడు యథార్థము వలికినాఁడని మెచ్చుకొనిరి. హరించిన ద్రవ్యమును దీసికొని స్వల్పమగు శిక్షవిధించి బుద్ధిసెప్పి రాజు గోపాలునింటికిఁ బంపివేసెను.

---

# 8. ఎక్కువసుఖము గోరినవారికి దుఃఖము తప్పదు.

—:o:—

తే॥ గీ॥ బ్రహ్మదేవుండు నుదుటను వ్రాసినట్లు
జనులకును జీవయాత్రలు సాగుచుండు
నున్నసుఖములతోఁ దృప్తినొందకుండ
యధిక సుఖములుగోరుట హానికరము॥

ఒక చిలుక యొక రాజు భవనమున రత్నపంజరము లోనుండి పెంచ బడుచుండెను. ఆరాజచంద్రుఁ డాచిలుక నతి గారాబముతోఁ బెంచుచుండెను. మిక్కిలి రుచిగల ఫలములను దెచ్చి యనుదినమును దానికి స్వయముగఁ దినుపించుచుండు. ఆరాజపత్ని తన సుకుమార హస్తములతో దానిని దువ్వుచు ముద్దువెట్టుకొనుచుండును. రాజపుత్రుఁడు తన సహవాసులతో దాని పలుకుల వినుటకు వచ్చి చప్పటలు చఱచి గంతులువైచి యాడుకొని దాని నాడించుచుండును. రాణి దానికిఁదనముద్దుపలుకులను నేర్పుచుండును. అట్లాచిలుక రాజకుటుంబముచే గౌరవింపఁబడుచు మాణిక్యసౌధమునందలిరత్నపంజరమున వసించుచునప్పుడప్పుడాభూపాలుని హస్తముల నలంకరించి యుద్యానవనములం దిరుగుచుండును. ఇట్లుండ నొకదినమున నాచిలుకకొక యూహ

జనించెను. "నాకు సకలసౌఖ్యములును నీరాజభవనమున నున్నవి. ఆహారాదుల వెన్నియున్నను స్వేచ్ఛా విహారము నకుమాత్రి మవకాశము గలుగుటలేదు. నాజాతి పక్షులన్ని యు నరణ్యప్రాంతముల నొకరి కట్టిడిలేక స్వేచ్ఛగఁ జరిం చుచు సౌఖ్యము ననుభవించుచున్నవి. ఎంతసుఖము గలిగి నను, ఒకని నిర్బంధములోనుంచుట ప్రాణులకు దుఃఖభాజ నము. రాజబంధువులు నన్నెన్నివిధముల గౌరవించినను నాకీ పంజరపు మధ్యభాగమును దాఁటి యొక యడుగిడుటకు వీలుకలుగదుకదా? ఛీ! నాకీనిర్బంధమేల? స్వేచ్ఛానుసార ముగ నాజాతితోఁ జేరి కాననంబునఁ జరింతును. ఈరాజు నాశ్రయింపని పక్షులు బ్రదుకుటలేదా? నాబందుగుల విడ నాడి జాతికి దూరమై యన్యజాతులతో వసించుట నాకేటి సౌఖ్యము? కావున నవకాశము గలిగినప్పుడు నేనెగిరిపోయి నా వారిఁగలిసికొందును." అని యూహించి సమయ మును వేచియుండెను. పంజరముందాటి యావలికిఁ బోవు నను వెంతకాలమునకును జిక్కకుండుటచే నాశుకమునకు సుఖము తగ్గి విచారముతో నాహారమును దినుటమానినది. శ్రవణానందమగు తనకంఠధ్వనితో నొక్కముక్క పలుకు పలుకుటకవయ్యెను. దానిస్థితిం దిలకించి రాజకాంత చింతిం చి చిలుక యస్వస్థతం దనపెనిమిటికిం జెప్పి, దీనిముప్పుఁదప్పిం చు చొప్పుం జెప్పు వారిని రప్పింపుఁడని కోరెను. భూరమును

డాకీరము ననారోగ్యమునకు విచారించి యారోగ్య పరీక్ష కులరప్పించిచూచెను. అడవిగాలి పీల్చినగాని యిదిమనఁజాల దు. పంజరమునుండి తప్పింప వలయునని వారు నుడివిరి. అం దులకు రాజునకు మనసొప్పకున్నను దాని యారోగ్యమును గోరినవాఁడగుటచే నట్లుచేసి విడిచెను. అంతనది సంతసించి యత్యుత్సాహమున మిన్నంది యడవికింబోయి తనవారిం జే రఁగోరినది. నాటినుండియు నాచిలుకకు వేళకుందగిన యా హారము దొరకుటలేదు. తన జాతితోపాటు దూరదేశమున కుఁబోవ శక్తిచాలకున్నది. గాలిదెబ్బకుఁ దూలిపోవు చున్నది. వానకు నానిపోవు చున్నది. తన యస్వభావమగు మనుష్య భాషల నాలకించి తన కులముచిలుకలు చెలిమి సూపుట లేదు. ఒక్క పక్కితోఁగూడ నిక్కమగు నేస్తము తనకుఁ జిక్కినదికాదు. ఇట్లుండ వర్షకాలమునందొకనాఁడు మహా వర్షము సంభవించెను. రివ్వురివ్వున చలిగాలి వీచుచుండెను. ఆకాశమునుండి వర్షధార లెడతెగకుండ భూమిపైఁ బడుచుం డెను. అయిదారు దినములు లోకబాంధవుని దర్శనముకా లేదు. భూలోకము జలపూరితమయ్యెను. ఆ చలిబాధ పడఁ జాలక తనజాతికి దూరమైన యాకీరమొక చెట్టుతొఱ్ఱకు జేరుకొనియెను. అంతకుముం దందిమిడియున్న చిలుకలు దీనినందు జొరనీయక ముక్కులతోఁ బొడిచి ఱెక్కలతోఁ గొట్టఁజొచ్చెను. అంతట నది ప్రాణావశిష్టమై "అక్కటా!

యెంతమందమతి నైతిని. మహారాజభవనమున సర్వసౌఖ్యములకుం గుఱియై యుండఁజాలక యిచ్చట నేదియో యంతకంటె సుఖమున్నదని భావించి వచ్చితిని. నాస్వేచ్ఛాపరివర్తనాభిలాష ప్రాణాంతికమైనది! అని దుఃఖించి కాలధర్మము నొందెను.

---

# 9. దేహబలముకన్న బుద్ధిబలము గొప్పది.

—:0—

ఆ॥ వె॥ తనుబలంబుకన్న ధనబలంబుకన్న
విద్యబలముకన్న వేనికన్న
బుద్ధిబలముగన్న పురుషుండు మిన్నయై
సకలకార్యములను జయముఁజేయు॥

ఒక యరణ్యమున మృగములకెల్ల రాజై యొక సింగము మాట చెల్లించుకొనుచుండెను. అయ్యది యనుదినమును నక్కాననంబునం దిరిమ్మరుచు తనకు లభించిన జంతువులను గొంతుకలో వైచుకొనుచుండెను. అందుచే మృగములకెల్ల గొప్ప యాపద సంభవించినది. ఆబాధ భరింపఁజాలక మృగములన్నియు నొకదినమున నాలోచన సభ

గావించి యిట్లు తీర్మానించుకొనియెను. "ఈ మృగరాజు మనల బ్రతుకనీయఁడనుమాట నిక్కవము. దీనికపాయము లేని యుపాయమాలోచింపఁ దగియున్నది. కావున మన మెల్లర మా కేసరికడకుంబోయి, దినమునకొక్క ప్రాణినిఁ నీయాహారమునకుఁ బంపెదమనియు, దొరకినవానినెల్లఁ దిన వద్దనియు విన్నవించుకొందము." అని యాలోచించి నిశ్చ యించుకొని యెల్లమృగములు నామృగరాజు కడకుంబోయి, యిట్లు మనవిచేసుకొనియెను. "దేవరవారికి మేమెల్ల దాసులము. ఇక్కాననంబున మీయానఁ దలనూనని సత్వ మొక్కండున లేదు. మావిన్నపమును దయాపూర్వకముగ నాలకింప గోరుచున్నాము. తమ యాహారార్థమై నేటికి వనంబునందలి మృగంబులు పాలమట్టునకు సమసిపోయినవి. ఇట్లే యింకను గొంతకాలము తాము పాలించితిరేని మందునకైన నియ్యరణ్యమున మృగంబు లభింపదు. అంతటఁ దామాకలి బాధనోర్వఁజాలక యుండవలసివచ్చును. కావున మేమొక్క యుపాయమాలోచించుకొంటిమి. ఇయ్యది మీకుంబోలిన నంగీకరింపవచ్చును. లేదేని తమ యిచ్చవచ్చిన చొప్పున మెలంగవచ్చును. ఇందుల కాగ్రహింపఁ బనిలేదు." అని యెను. అదియేమని కేసరి యడిగెను. "మేము వంతులవ్రకారముగ దినమున కొక్కరము మీయాహారార్థము వచ్చెదము. దానిని మీరు యథేష్టముగ భక్షింపవచ్చును. దీనిచే

మీకనాయాసముగ నాహారము లభించుటయేగాక మాకును అంతగా హానియుండదు. ఇందులకుమీరంగీకరింపవలయును.” అనవుడు నామృగపతి యాందుల కంగీకరించి వేళదప్పకుండ ననుదినము నెవ్వరో యొకరు తప్ప రాకుండిరేని మిమ్మెల్లర నొక్కముద్దగాఁ గైకొందునని కట్టడిచేసి వానింబంపివైచెను. అందుల కాశ్వాపదంబులు ముదంబుఁజెందిపోయి, యన్న మాటను జెల్లించుచుండెను. ఇట్లు చిరకాలము గడచిపోయెను. అంతనొక్క దినంబున నొక కుందేలునకు వంతు వచ్చెను. దానికయ్యది చాలచింతించి, నేఁడీ ఘోరమృగమునకు నేనాహారము గావలయుఁ గాఁబోలును. ఎంతపాపము చేసితిని? అని కొంతసేపొక యుపాయమాలోచించి, మృగపతికడకుఁబోవఁ బయనమయ్యెను. మెల్లనఁ దప్పటడుగు లిడుచు, నియమితకాల మతిక్రమించిన పిమ్మట నాసింగంబు ముంగిలికిఁబోయి వంగి నమస్కరించెను. అంత నాహర్యక్షము కన్నులెఱ్ఱనారనాశశకంబుం గిలకించి “యోరీ! నీవింత యాలస్యముగ వచ్చుటకుఁ గారణమేమి? రాజాజ్ఞన దిరస్కరించిన నిన్నేమిచేయుదునో చూడు”మని దానిపైఁ బడఁబోయెను. అందుల కాకుందేలు కేలుమోడ్చి యయ్యా! కారణము మనవిచేసికొందును. దయయుంచి యొక్క నిముసము నామాటలాలకింపందగునని మనవిచేసెను. అదియేమని సింహము ప్రశ్నించెను. “అయ్యా! దేవరయానఁ దలఁదాల్చి

వేళ దాటకుండ రావలెనని బయలుదేరి వచ్చుచుంటిని. మార్గమధ్యమున మఱియొక సింగము సన్నడ్డగించినది. నన్నె చ్చటికిఁ బోవుచుంటివని యడిగినది. దేవరవారి సన్నిధికి వచ్చుచున్నానని చెప్పితిని. ఈవనమునకెల్ల మృగరాజునై నేనుండ నొండొకని కడకుఁ బోవ జెల్లదు. మృగములెల్ల నేటినుండి నాయండకే వచ్చుచుండవలయును. నీవు చెప్పిన సింగమెచ్చట నున్నదో నాకుఁ జూపింపుము. అని నన్ను బట్టుకొనియెను. అంత నేను చేయునదిలేక ప్రాణము లర చేతఁబట్టుకొని యెట్లయినఁ దప్పించుకొని రావలయునని యత్నించి, అయ్యా! నేనాహారముగాఁ బోవనెంచిన సింగ మును మీకుఁ జూపించెదను. నన్ను విడువు డనిచెప్పి తప్పిం చుకొని యిటకువచ్చితిని. నాయాలస్యమునకుం దగు కార ణము మనవిచేసికొంటిని. పిమ్మట దేవరచిత్తము." అని కుం దేలు నుడివెను. అంతట నా మృగపతి యతికోపమున "ఓరా! యా మృగాధము డెచ్చట నున్నాఁడు? నాకుం జూపుము. మున్నుగ వాని యుక్కడంచి పిమ్మట నిన్ను భక్షింతును. అని బయలుదేరెను. శశకము సరియేపోవు దము రండని తాను దానింజూపు దానివలె ముందు నడ చుచు నక్కాననమధ్యమంబుననున్న యొకనేలనూతికడ కుం దీసికొనిపోయి, దీనిలోనున్నది చిత్తగింపుఁడని సవిన యంబుగ మనవిచేసెను. అంత నది యానూతియందు

జూచునప్పటి కానీటియందుగ్రమగు తన రూపము ప్రతి ఫలింప, దానింజూచి వేరొక సింగంబుగా భావించి గర్జించి దానిబట్టబోయి యందుమికెను. అంతట నాకుందే లాహ ర్యక్షమును వీక్షించి మహాప్రభూ! నాపని తీరినది. మీపని యైనది. కావున నేను శెలవు దీసికొందును. నిరపరాధము లగు మృగములయందుఁ దాము సూపిన కరుణారసమున కుం దగిన కృతజ్ఞతను వెల్లడించుకొను భాగ్యమునాకుఁ దాము కలిగించినందులకు మీకు వందనములనిచెప్పి తన జాతివారిం జేరుకొనఁబోయెను.

అంతట నచ్చటి మృగములు మృత్యువు మొగము నుండి తప్పించుకొనివచ్చిన యీకుందేలు నభినందించి యెట్లు రాఁగలిగితివని ప్రశ్నించిరి. మిత్రులారా! బుద్ధిబల మునకు సాధ్యముగానిపని లోకమునలేదు. అని తాను చేసినపనిని వారి కెఱుఁగజెప్పెను. అంత నీకుందేలు నెల్ల మృగములును గౌరవించి యాలోచనావసరములందు దీని సహాయమును గోరుచు నపాయములేకఁ గాలక్షేపము జేయుచుండెను.

---

# 10. భగవంతుని సంకల్పమునకు భంగము లేదు.



తే॥ గీ॥ ఘటనఁగనరానివస్తువుల్ గలుపుచుండు
ఘటనయగు వస్తువుల వేఱుగా నొనర్చుఁ
దెలియఁబడదద్ది సృష్టించు నలువకైన
దైవసంకల్పమును దాటఁ దరముకాదు.

మథురానగరమున సుసేనుఁడను నొక యాదవుఁడు గలఁడు. ఆతనికిఁ జందనగంధియను నొక కుమార్తెయుండెను. ఆమెకుఁ గడుఁ జిన్నతనమునఁ దండ్రి వివాహమొనర్చెను. వివాహమయిన కొలఁది దినములకే యామెభర్త కాశీ యాత్రకుఁ బయలుదేరి పోయెను. క్రమముగా నామె యుక్తవయస్కురాలయ్యెను. ఆమె, తన పతి రాకనుగోరి యనేక దేవతలకు మ్రొక్కుచుఁ బెక్కువ్రతముల నాచరించుచుఁ బరపురుషుల మొగముసూడకఁ బరమార్థ చిత్తయై కాలముం గడపుచుఁ దన సౌశీల్యముచేఁ గృష్ణునిఁ బ్రేమించెడు వల్లవకామినులకు బుద్ధిసెప్పుచుండెను. అది గ్రహించి శ్రీకృష్ణుఁడు చందనగంధి పాతివ్రత్యమునకు భంగము గలిగించి యాగర్వమునడంపవలెనని యూహించి, యొకనాటి ప్రాతఃకాలమునఁ గాశీ ప్రయాణికుని వేసము ధరించి

యమునానదీ తీరమునందలి నీళ్ళరేవునఁ గూర్చుండి యుండెను.

ఇంతలోఁ గొందరు మందగమనలు జలము గొని పోవుట కారేవునకు వచ్చిరి. వారిఁగాంచి యీ మాయా యాత్రికుఁడు, అమ్మలారా! ఈపట్టణంబునఁ జందనగంధియను నామెకు సేమమేనా? యని ప్రశ్నించెను. అదివిని వారు మీరెవ్వరు? ఆమె ప్రసక్తి మీ కేల? యని యడిగిరి. చిర కాలమైనది. ఆమెను వివాహమాడితిని. కాశీ యాత్రకుం బోయితిని. మానవ దేహము లస్థిరములుగాన నామె సేమ ము నారయఁగోరి మిమ్మిట్లడిగితిని. అని యాత్రికుఁడు బదులుచెప్పెను. దానికివారు మిగుల సంతసించి, మన చందనగంధి నోములు ఫలించినవి. దాని యదృష్టము పండి నది అనుకొని, యామె సేమము నాతనికిం జెప్పి క్షణ ములో నీవార్తను సుసేనునకుం దెలియఁజెప్పిరి. అంతట సుసేనుఁ డమితానందమున యుబ్బి తన బంధుగులం జేరి మంగళధ్వనులతో నల్లునిం దెచ్చుట కెదురుగఁబోయి, స్వాగ తంబిచ్చి సగౌరవముగ నింటికిం దోడ్కొనివచ్చెను. ఇం తలో నారదుఁ డచ్చటికేతెంచి వారిచేఁ బూజింపఁబడి యిట్లనియె. "సుసేనా! నీవు పుణ్యాత్ముఁడవు. నీకన్య పవిత్ర చరిత్ర. మీకోర్కులు ఫలించినవి. నేఁడే యీనవదంపతు లకుఁ బునస్సంధానమున కనుకూలమగు దినము. కావున

నట్టి శుభమున నెరవేర్చి కృతార్థుఁడవగుము."

దానికి సుసేనుఁడు సంతోషపూర్వకముగ నంగీకరించెను. బంధుగులనెల్ల రావించెను. వలయు సంభారముల నన్నింటిని సేకరించుకొనుచుండెను. సేవకులు గృహమునకును, చెలికత్తెలు చందనగంధికిని, దగు నలంకారములఁ జేయుచుండిరి.

ఇంతలోఁ గొంతప్రొద్దెక్కునప్పటికి మఱియొక కాశీ యాత్రికుఁడు, ఆకారాదులయందుఁ దొల్లిఁటివానితోఁ దులఁదూఁగు నాతఁడు, మఱియొక వీధినుండివచ్చి సుసేనుని యింటిముందు నిలఁబడి, చందనగంధి తండ్రి యిల్లిదియేనా? యని యడిగెను. అక్కడివారు, ఇదియే. ఏమి? యని యడుగుచుండిరి. ఏమియునులేదు. నేను చందనగంధి భర్తను లెండి, యని యాతఁడు చెప్పుచుండెను. వినువారి కాశ్చర్యము గలుగుచుండెను. మఱియొకఁ డిట్టివాఁడే దొడ్డిగుమ్మముకడ మా మామగారిల్లిదియేనా? చూచి, చిరకాలమైనది. గుఱుతు చాలకున్నది యనుచుండెను. ఇట్లే నలుదిక్కుల నుండియు నాలుగుజాములలో నాలుగువందలమంది చందనగంధి భర్తలు సుసేను నింటికిఁ జేరుకొనిరి. గృహములోని యవకాశమునంతటి నాక్రమించుకొనగా వీధియరుగులు కూడ నిండఁజొచ్చెను. వీధిగుమ్మమును గొందరరికట్టిరి. పశువుల పాకలందున్నవారిని బరీక్షించువారే లేకపోయిరి.

వైదికముగ నారదు చందనగంధి నిజభర్తగూడవచ్చియుండెను. ఆ పౌరులెల్ల రీవింతఁ జూచుటకు వచ్చుచుఁ బోవుచుండిరి. సుసేనుని గృహమా దినమునఁ గొన్నివేలమంది జనులచేఁ గిటకిటలాడుచుండెను. పాపిద్దుగృంకెను. ఆగృహస్థుని కేమి చేయుటకును దోఁచకుండెను. నారదునిజూచి స్వామీ! ఇది యేమిపాపము. నేనిప్పుడేమి చేయవలయును? వీరిలోఁ జందనగంధి వరుఁడెవ్వఁడు. వేషభాషలలో వీరెల్లరు నొక్క తీరున నున్నారు. ఎట్లు నిర్ణయింపనగును? మహాత్ములగు తామే యీ యాపత్సముద్రముం దొలఁగించి నన్ను గట్టునఁ బడవేయవలెనని ప్రార్థించెను. నీకు వచ్చిన భయము లేదు, రమ్మని నారదుఁ డావచ్చిన యాత్రికులంజూచి, మీ రెల్లరు జందనగంధి భర్తలగుట యసంభవము. "మీ వివాహకాలమునందు జరిగిన సంగతులను మేము కొన్నిటిని బ్రశ్నించెదము. అవి సరిగఁ జెప్పినవాఁడే యామెకుఁ బతి యగును." అనిచెప్పి, యుదయమునుండియు నందఱికంటె నెక్కుడుగ నేనే యామెభర్తనని నోరువెత్తి కొట్టుకొను చున్న నిజమగు నామెభర్తను గొన్ని ప్రశ్నలడిగెను. ఆతఁ డెన్నఁడో జరిగినది జ్ఞాపకము లేనందునసరిగ జెప్పలేకపోయెను. అంతట గృష్ణయాత్రికుఁడు నేను చెప్పెదనని యడిగిన ప్రశ్నల కెల్ల సమాధానముఁ జెప్పుటయేగాక వారు మరచిన వానినిగూడఁ గొన్నిటిని జ్ఞప్తికిఁ దెచ్చెను. అట్లుచెప్పిన

వాఁడు మఱియొకఁడు లేకపోవుటచే నీతఁడే యామె మగఁడని నిశ్చయించిరి. అంతటఁ జందనగంధికి నందియముదీరక తదేక దీక్షతో భగవంతుని బ్రార్థించెను. అంతఁ గృష్ణుఁడనుగ్రహించి యామెకుఁ దననిజరూపమునఁ బ్రత్యక్షుమై పతివ్రతారత్నమగు చందనగంధికిందఱు భర్తలా? యనినవ్వి యామె నిజభర్తను జేయివట్టి తోడ్కొనివచ్చి చూపెను. తక్కుంగల భర్తలెల్లరు నదృశ్యులైరి. భగవత్సంకల్పమున నెల్లరుఁ దెల్లవోయిరి.

---

# 11. తలవ్రాత తప్పదు.

—:0:—

తే॥ గీ॥ ధరణి సమబుద్ధినేలు మాంధాతకైన
సత్యసంధుడయిన హరిశ్చంద్ర నృపతి
కైన శ్రీరామచంద్రునకైన గాని
ధాత వ్రాసిన తలవ్రాలు తప్పఁబోదు॥

బ్రహ్మదేవుని మానసపుత్రుండగు నారదమహాముని౦ద్రుఁడు సకలలోకములయందును సంచరించుచు నొక్క

నాఁడు భూలోకంబున సముద్రతీరమార్గమునఁ బోవుచుం డెను. అచ్చట నొక్క మానవుని కపాలమాత్రని కంటఁబడి యె. దానింగాంచి యమ్మునివరుండు చెంతకుంబోయి యా పుఱ్ఱియ మొగంబునందున్న బ్రహ్మలిపిని జదివెను. అందిట్లు నాల్గుపంక్తులు వ్రాయఁబడియున్నవి. "పుట్టినది మొదలు కొని దారిద్ర్యము" "పదివత్సరంబులు కారాగృహము" "సముద్రపుటొడ్డున మరణము" "కొంచము భోగము"ను గలుగును. ఔరా? ఏమి? యీ యన్యాయము? బ్రహ్మదే వునికేమి మతిపోయినదా? ఇట్టిదేహిని దన్ను సృష్టింపుమని యెడ్చినవారెవ్వరు? పోనిమ్ము. దేహి పూర్వజన్మకర్మమున ఫలమనుభవించుననుకొందము. మొదటి మూఁడు పంక్తుల కును, నాలవ పంక్తికిని యేమయిన సంబంధము గలదా? ముదిమిచే మదితప్పిన యీ తాతకింక నీ యుద్యోగము నకు సెలవిప్పింపవచ్చును. ఈవ్రాతల కర్థమేమో సత్యలోక మునకుఁ బోయి సుర సిద్ధ మునీంద్రులెల్లరున గూడియున్న సభలో బ్రహ్మను బ్రశ్నించెదఁగాక. ఇక్కడ నాకీ విచార ణ మేల యనుకొని యాపుఱ్ఱియు దన బ్రహ్మదండమునకుం దగుల్చుకొని తిన్నఁగ సత్యలోకమునకుం బోయెను.

చతుర్వేదంబులును సాంగంబులై తన్ను సేవింప, సుర సిద్ధ మునీంద్రులెల్ల దన్ను బరివేష్టింప, భారతిం దొడ పై నిడుకొని వనజభవుండు పేరోలగంబుండిన యవసరం

బున సురమునీంద్రుఁడా కపాలముంగొని యచ్చటకుం జనియెను.

అట్లు వచ్చిన తన తనయుని నుచితగతి గారవించి యావిరించి యిట్లనియె. "నారదా! యెటనుండి వచ్చుచుంటివి? విశేషంబు లేమయిన గలవా? ఈపవిత్రమగు బ్రహ్మదండమున కీమానవ కపాలమెట్లు వచ్చినది? యేదియో మనమున భావించువాఁడువోలె నగపడుచుంటివి? అయ్యది మేము విన(బోలునే?" యనుటయు నారదుం డిట్లనియె. తాతా! ఈచేతఁగాని సృష్టినిమానివేసి నీవింకను విశ్రాంతి నొందకుండుట నాకు విచారకరముగఁ గన్పట్టుచున్నది లక్ష్మీపుత్రుఁడవు, నీకీ యుద్యోగముండిననేఁగాని పొట్ట గడువదాయేమి? ఎందులకింకను వృథాయాసము నొందెదవు? నీనయఃకాలములో నీవొనరించిన సృష్టి క్రియకును, ముదిమియందు నీవుచేయు దానికిని హస్తిమశకాంతరము గలదు. ఇట్లే యింకను గొంతకాల ముద్యోగ మభిలషింతువేని పరిహాసాస్పదుఁడవగుటయేగాక తొల్లిటి గౌరవమును గూడఁ గోల్పోయినవాఁడవగుదువు. కాన నామాట గీటు నంబుచ్చక యీపనినుండి తొలంగుము.

బ్రహ్మ:-విషయముం జెప్పకుండ యూరక సభామధ్యమున నన్నిట్లు దూలనాడుచుంటివేమి? ఇప్పుడు నా సృష్టి యందుఁగల లోపమేమి?

నార:-లోపమా! అంతయును లోపమే. ఒకదాని కొకటి సంబంధమేలేదు. సరిగదా? స్వధర్మము నతిక్రమించుట.

బ్రహ్మ:- అసంబంధమా! స్వధర్మాతిక్రమణమా! ఎంత వింత! అట్టి సృష్టిలో నొక యుదాహరణమును గనుపఱచెదవా?

నార:-కనుపఱుప కేమి? తప్పును దిద్దుకొందువా?

బ్రహ్మ:-తప్పయినచో దిద్దుకొనుట కేమిసందియము?

నార:-తప్పుకానిది తప్పని చెప్పునంతటి మూర్ఖుఁడనా?

బ్రహ్మ:-నే నట్లనలేదు. కర్త యభిప్రాయమునకును జూచువారి భావములకును భేదముండవచ్చును. కావున నట్లంటిని.

నార:-ఇదిగో ప్రత్యక్షముగ నీచేసిన తప్పొక్కటి కనుపఱచెదను చూడుము. (పుఱ్ఱెనుజూపి) ఇదియేమి?

బ్రహ్మ:-మనుష్య కపాలము.

నార:-దీనియం దెన్ని పంక్తులు వ్రాయఁబడినవి.

బ్రహ్మ:-నాలుగు పంక్తులు.

నార:-బ్రహ్మయైనవాఁడు వ్రాయఁదగు పంక్తు లెన్ని?

బ్రహ్మ:-మూఁడు.

నార:-నాలవపంక్తి వ్రాసితివి. ఇది స్వధర్మాతిక్రమణ మగునా? కాదా?

బ్రహ్మ:-ఆవశ్యకతనుబట్టి మఱియొకపంక్తి వ్రాయుటకు నా కధికారము గలదు.

నార:-సరియే ఉండుగాక. ఈదేహిని బుట్టించుటలో నర్థ మేమయినఁ గలదా?

బ్రహ్మ:-లేకేమి? ఎందులకుఁ బుట్టింపరాదు?

నార:-మొదటి మూఁడుపంక్తులును జదువుము? పుట్టినది మొదలు దరిద్రమా? పది వర్షములు కారాబంధ నమా? ఇంకనుజాలక దిక్కులేనిచోట నెక్కడనో సముద్రతీరమున మరణమా? జీవితమందొక్క దిన మునఁగూడ నీదేహికి సుఖములేదుగదా?

బ్రహ్మ:-అది యతని తొల్లిఁటి పాపకర్మము. దానికేమి చేయుదుము?

నార:-కేవల పాపకర్మమున కేజంతువో యగునుగాని మాన వుఁ డెట్లగును? పుణ్యపాపకర్మముల సమ్మేళనము చేతఁగదా? మనుష్యదేహము. అట్టి పుణ్యమునకు ఫలమేది? అదియునుగాక మఱియొక యసంబంధము. మరణమైన పిమ్మట నాల్గవపంక్తిలో "కొంచెము భోగము గలుగును." అనియున్నది. చచ్చినవానికింక ను భోగమెట్టిది?

బ్రహ్మ:-ఇదియా నీసందేహము? నాయనా! ఎంత వెఱ్ఱి వాఁడవోయి? ఏ స్వల్పపుణ్యమో యుండుటచేత నే

బ్రహ్మర్షివగు నీబ్రహ్మదండమునఁ దగుల్పఁబడి సత్య లోకమునకువచ్చి యీ పరమపవిత్రస్థలమున నీకపాలము విమర్శింపఁ బడుచున్నది. అదియే యీ దేహికి సకలపాపహరమగు భోగము! ఇంతకంటె నేమి కావలయును? నారదుఁడు తన యజ్ఞానమునకు సిగ్గిలి వెడలిపోయెను.

---

## 12. దైవయోగము.

—:0:—

తే॥ గీ॥ ధరణీ వలయంబునేలు భూధవునికైన
నడవులఁ జరించునట్టి సన్న్యాసికైన
ఖగములకునైనను, మృగసంఘములకైన
దైవయోగంబు దాటంగఁ దరముగాదు॥

లంకాధిపతియగు రావణాసురుఁ డొక దినమున నేకాంతముందుండి తన మనంబున నిట్లని వితర్కించె. "నేను మహోన్నతమగు తపంబాచరించితిని. సృష్టికర్తయగు విధాత మెప్పువడసితిని. త్రిలోకంబుల నెదురులేని బలంబు గడించితిని. దేవదానవులచేఁ జావులేనివరంబు వరించి సఫల మనోరథుండనైతిని. ఈశ్వరు నారాధించి శాశ్వతంబగు నైశ్వర్యంబునం, దులఁదూగుచుంటిని. సురలు నాకింకరులు.

దానవులు నాబానిసలు. మానవులమాటఁ దలఁపనేల? కాని నామనంబున నెడతెగని విచారంబొండు బాధించుచున్నయది. పుట్టిన ప్రతి జంతువును గొంతకాలమునకైనఁ గిట్టకఁ దప్పదు. వరముల బలమున నమరత్వంబును బొందనెంచిన హిరణ్యకశిపునంతవానికి మరణము తప్పినదికాదు. తాత నాకోరిన వరములిచ్చెనని సంతసించితిని గాని మరణమెట్లు గలుగునని యడుగనైతిని. వరించుటలో దేవదానవులచేఁ జావులేకుండవలయునని కోరితినిగాని, నరులమాట లెక్కింపనైతి. కాలము తప్పివచ్చునప్పటికి మానవులు మాత్రము మారకులు కాఁజాలరా? నాకీ దీర్ఘవిచారమేల? నేను తిరిగి విధాతకడకుంబోయి నాకు మరణమెట్లుగలుగునో? యడిగి తెలియుదుంగాక. అయ్యది యెఱుంగుదనుకఁ జిత్తంబునకు శాంతి యొదవదు. మార్జాలమూషికన్యాయమున మృత్యువు దేహికొఱకు సకలకాలంబులయందుం బొంచియుండు. ఎన్నఁడో యొకనాఁడు సర్వప్రాణులకుం దానివాతఁబడకఁదీరదు. రాఁగల యాపదఁ బాపుకొనుట కుపాయమారయుట ధీమంతుల లక్షణము. కావున నే నన్నివిధముల మృత్యువుఁ దప్పించుకొన యత్నించెదను." అని వితర్కించి సత్యలోకంబునకుం జని, విధాతంజూచి తాతా! సేమమా? యని కుశలంబడిగి, నాకు, మారకుండెవ్వఁడగునని ప్రశ్నించెను. దానికి విరించి, "నాయనా! నీ

కిప్పుడావిచారమేల? చిరకాలభావ్యంబగు ననర్థంబును నేడే విమర్శింపనక్కరలేదు. అయినను, నీ ప్రశ్నమున కుత్తరము చెప్పకుండుట తగదు. కావున వచించెద సావధానుండవై వినుము."

"కోసలదేశములకు రాజధానియగు నయోధ్యాపురంబును దశరథుఁడను రాజయునకుఁ డొకండు పరిపాలించుచున్నాఁడు. ఆతనికిఁ గోసలరాజపుత్రికయగు, కౌసల్యయను ధర్మపత్నియందు శ్రీరాముండనువాఁడు జన్మింపంగలండు. ఆరాకొమరుండు నీకు భీకరమారకుండగు. అడిగినదానికి నుడువకుండుట యధర్మంబుగావునఁ జెప్పితిని. దీనికి నీవు నాపైఁ గినియకుండుదువుగాక", యనుటయు, నబ్జజుని మాటలకు హృదయంబు బీటవార, నన్నిశాటాధిపుండు పద్మగర్భున కిట్లనియె. "నీవు వచించినదానికి నా కలుక జనింపదు. రాగల యనర్థంబునకుఁ బ్రతీకారంబు సేసికొనను టకుందగు మార్గంబు సూపితివి. నాకుఁ గడుంగడు సంతసంబ, పోయివచ్చెద, సెలవిమ్మని" సవినయంబుగ నటఁ గదలి నిజనివాసంబునకుం జని వార్తాహరుల వలన దశరథుని వృత్తాంతంబులం దెలియఁ గుతూహలియైయుండె. అంతఁ గొండొక దినంబున సకలలోకసంచారియగు నారదుండు వచ్చి, రావణుం దిలకించి లంకేశ్వరా! నీవు క[illegible] విచారగ్రస్తునివలె నగుపడుచున్నాఁడవు. ఇట్టి యునికము

న్నెన్నఁడు నీకడ నేను చూచి యెఱుంగను. కారణము నే వినఁదగునే? యనుఁడు దశాస్యుం డిట్లనియె. దశరథుండను నొక రాజయువకుం డయోధ్యనేలుచుండెనఁట. ఆతనికిఁ గౌసల్యయను పట్టమహిషివలన శ్రీరాముండనువాఁడు జన్మించునఁట. ఆతనివలన నాకు మరణంబు సిద్ధంబఁట. ఈవిషయంబు పితామహునివలన వినంబడియె. ఇయ్యది నిక్కువంబు గానోపు. దీని విన్ననాటినుండియు నీభావ్యనర్థంబునకుఁ బ్రతీకారం బారయుచుంటిని. తెలియునేడల నాదశరథుని వృత్తాంతముం జెప్పుము. నావుడు నారదుం డిట్లనియె. దశవదనా! దశరథు నెఱుంగుదు. ఆతండిప్పటి కవివాహితుండు. కోసలరాజు, తనకూతునాతని కిచ్చెదనని వాగ్దానమొనర్చియుండుటంబట్టి వివాహముహూర్తంబు వసిష్ఠునిచే నేటి కైదవదినంబున నిర్ణయింపంబడియె. అయోధ్యా నగరంబు సర్వాలంకారభూషితంబై పౌరజనోత్సాహపూరితమై విరాజిల్లుచున్నయది. సామంతరాజులకెల్ల వివాహమహోత్సవాహ్వానములు సేరుచున్నవి. రాజబంధుగులు, దాసదాసీవర్గములతో నేతెంచుచున్నారు. దశరథుని వివాహమంగళ వైభవములనుగూర్చి జనులనేకు లనేకవిధముల నుగ్గడించుచున్నవారు. నేటికి మూడవదినమున నయోధ్యనుండి పెండ్లివారు సరయూనదీమార్గమునఁ దరలిపోవుదురు. పంక్తిరథునిగూర్చి నాకుం దెలిసిన విషయం బియ్యది.

నీకుం గలుగఁబోవు నాపదకుం బ్రతిక్రియ యొనర్పినంతగావిం చుకొనుము. నావుడుఁ దశవదనుండు పట్టరాని సంతసంబునఁ దెలియందగు విషయంబెల్ల దెల్లంబుగఁ దెలుపుటకు నార దునకుఁ గడించి వీడ్కొలిపి కుంభాండుండను తన సేవకుం బిలిచి యోరీ! నీవు కొందఱు నిశాచరుల వెంటం గొనిపోయి నేటికి మూడవదినమున నయోధ్యా నగరంబునుండి సరయూనదీ మార్గమున వివాహమునకుఁ దరలిపోవు దశరథుని నౌకను ముంచివైచి తరలిరమ్ము. నాయాన నతిక్రమించితివేని ప్రా ణంబులకుం జెడిన వాఁడవగుదువని యాజ్ఞ యిచ్చుటయు, వాఁడు మహాప్రసాదంబని యానతి నంగీకరించి చనియె.

అంత రావణుఁడు కోసలరాజభవనంబునకుఁ బ్రచ్ఛ న్న వేషంబునం జని నిద్రాపరాధీనయగు నాతని పుత్రిక యగు కౌసల్య నర్ధరాత్రంబున నితరులెఱుంగకుండ లంకా పట్టణంబునకుం గొనితెచ్చి, యొక్క రత్నపేటికా మధ్యంబు న నక్కన్యకామణి నునిచి, నక్రముఖుఁడను నొక్క సేవ కుం బిలిచి, యోరీ నీవీపేటికను, మ్రింగి, గర్భంబున భద్రం బుగా ధరించి, సముద్రమధ్యమంబున నాయాజ్ఞయగుదనుక దాఁగియుండునది. అప్రమత్తుండవు కావలయుంజుమీ? భద్రం బని చెప్పిన నతండు తత్క్షణంబ, నక్రరూపంబున నా రత్న పేటిక నాతని యెదుటనే గుటుక్కున మ్రింగి సముద్ర మధ్యమంబునకుం జనియె.

అట నయోధ్యాపురంబున దశరథుండు బంధుమిత్ర పరివారయుతంబుగ శుభముహూర్తంబునం దరలి, సరయూనదింగల నౌక నధిరోహించి కోసలరాజ పట్టణంబున కుం జనుచుండ నర్ధరాత్రసమయంబున నదీమార్గమధ్యమంబున, రావణప్రేరితులగు కుంభాండుండు మున్నగు నిశాచరులా నౌక నానదీమధ్యమంబున ముంచివైచిరి.

ఇట సముద్రమధ్యమంబున నక్రముఖుండు కౌసల్యా గర్భంబగు నప్పేటికం దన గర్భంబున భద్రం బొనరించి, కనుగలిగి మెలఁగుచుండఁ గొండొక నక్రంబు పరాక్రమించి తన్న కదనంబునకుం దాఁకుటయు, నా రతనపుఁబెట్టె, తన శరీరలాఘవంబున కంతరాయంబగునని తలంచి, దాని నొక ద్వీపమున భద్రపఱచి పయోధిమధ్యమంబునకుం జని యా జలగ్రహముతో విగ్రహంబు నెరపుచుండె.

సరయూనదీ నిమగ్నంబగు నౌకనుండి దశరథ సుమంత్రులిర్వురు, నౌక తెప్పకొయ్య యాధారమున సముద్రమునం బ్రవేశించి వాయువశంబున నా ద్వీపంబునకుం జేరి, సేదదేరి, దూరమున సూర్యకిరణ ప్రసారంబున నినుమడించిన కాంతిచే వెలుంగుచున్న యారత్నపేటిక తమ చూపుల నాకర్షింప, దాని గదియం జేరి మూతం దెఱచి చూడఁ, ద్రిలోకసుందరియగు మగువ వారి కగుపడెను. అ కన్య యనన్యసౌందర్యంబున కబ్బురపడి దుస్థితికి దుఃఖించి

సుమంతుం డామెతో నిట్లనియె.

అమ్మా! నీపేరేమి? నీ తలిదండ్రులెవ్వరు. ఎచ్చోట జన్మించితివి. నీకీ నిర్జనప్రదేశమున నునికి యెట్లు సిద్ధించె. నీ వృత్తాంతంబెల్లఁ దెల్లంబుగ మాకెఱింగింపుము. నీ కిసుమంతయు భయంబులేదు. నావుడు నావనిత వారింజూచి కన్నుల నీరు గ్రమ్మఁదలవాంచి యిట్లనియె. మహాత్ములారా! మీరెవ్వరో నేనెఱుంగ. ఈ విపత్సముద్రంబునం బడియున్న నన్నుద్ధరించుట కేతెంచిన యాపద్బాంధవులుగా నోపుదురు. దుఃఖకరంబగు నాచరిత్రంబును గరుణాళువులగు తమకు వినుపించి నూతనసంతాపంబు గలిగింపఁజాల. అయినను దుఃఖము చెప్పకొనినగాని కొంత యుపశమింపదు. వచించెద వినుండు.

నేను కోసలరాజు పుత్రికను. కౌసల్య యనంబడుదాన. అయోధ్యాధిపతియగు దశరథునికి మాతండ్రిచే వాగ్దత్తనై నేడు జరుగంగల నా వివాహమునకు మంగళద్రవ్యములచే నలంకృతనై నాతండ్రియింట నిద్రించుచుండ రావణుఁడను దురాత్ముం డేలాగో నన్ను చోరవృత్తిం దొంగిలి, లంకకుం దెచ్చి, యీ పెటికాంతరమున నన్నునిచి, యొక మొసలి రక్కసుని భద్రంబుగ సముద్రంబునం దాఁచుమనియె. ఆ నిశాచరుఁడు, నేనున్న పెట్టియను గుటుక్కున మ్రింగి గర్భమునదాల్చి సముద్రమధ్యమంబున కేతెంచి,

యీ లంకాతీరంబున నన్నునిచె. ఇదియ నావృత్తాంతంబు. తొల్లింటి జన్మంబున నేఁజేసినపుణ్యపరిపాకవశంబున నీయాంప త్సమయంబున నన్నోదార్చిన పుణ్యుల దర్శనంబు నాకుశుభ సంధాయకంబుగా నోపునని విన్నదనంబునఁ గన్నీరు మున్నీరు గ విలపించు నక్కన్నియ నెన్నియో తెన్నుల మన్నించి యూ రడించి సుమంత్రుం డిట్లనియె.

అమ్మా! ఇది నీకు సంతోషసమయముగాని చింతా సమయముగాదు. దైవయోగమును దప్పింప నీశ్వరునికైన శక్యంబుగాదు. ఈరాజపుత్రుండు నీవరుండగు దశరథుండు. నేను సుమంత్రుండనఁబడు బ్రాహ్మణుండ. ఈతని యమా త్యుండను. వసిష్ఠుఁడు నిర్ణయించిన వివాహమంగళ ముహూ ర్తమమోఘము. అని తమ చరిత్రముగూడ వినిపించి సుము హూర్తకాల మతిక్రమింపకుండ సుమంత్రుం డవ్వధూవరులకు గరగ్రహణ విధానమును నడపించి మంగళాశీర్వచన పూ ర్వకముగ నప్పేటిక, నవ్వధూవరుల, నునిచి తానుగూడ దానం జేరి యుండెను.

అంత నట లంకాపట్టణంబున రావణుండు వసిష్ఠ నిర్ణీ తంబగు ముహూర్తకాల మతిక్రమించుటం జేసి, యుత్సాహ పూరిత మనస్కుండై తానొనరించిన ఘనకార్యంబునకుఁ దనలోఁదాను మురియుచుండ మరల నారదుం డామార్గం బునంబోవుచు రావణుం జేరంజని సఫలమనోరథుండవైతివే?

యని ప్రశ్నింప, రావణుం డిట్లనియె. అజ్ఞులు గొందఱు విధిని దాటరాదందురు. అదియెల్లఁ గల్ల. ప్రబలమగు పురుషకారమును దైవబల మతిక్రమింపఁజాలదు. దాని కీదశరథవివాహమే తార్కాణము. వసిష్ఠముహూర్తబల మేనీటఁగలసినది. కౌసల్యాదశరథులకుఁ బరిణయ మెందులకుఁ గాలేదు? అని పరిహసించు దశకంధరు నంధత్వంబునకుఁ జింతించి నారదుం డిట్లనియె. రాక్షసేశ్వరా! వసిష్ఠు డమోఘవచస్కుఁడు. నాచిత్తంబునకుఁ గౌశల్యాదశరథులకుఁ బాణిగ్రహణంబు జరిగియుండునని గోచరించుచున్నయది. అనవుఁడు రావణుం డదరిపడి, యది యసంభవము. పెండ్లికిం దరలిపోవుచున్న దశరథుని, సపరివారముగ సరయూనదిపాలు చేయించితిని. కౌసల్యను మహానక్రంబు గర్భంబున నునిచి సముద్రమధ్యమంబున డాఁచితిని. ఈ వధూవరుల కెట్లు సంఘటనంబు సిద్ధించు? వసిష్ఠునియెడ నీకుంగల విశ్వాసంబున నట్లు వచించితివిగాని ఈ పాణిగ్రహణముమాత్ర మెన్నటికిని సిద్ధించునదిగాదు. నా పురుషకారమును నీవే ప్రత్యక్షమునఁ జూచెదవుగాక.”యని సముద్రమధ్యస్థుండగు నక్రముఖుని నత్వరంబుగ రావలసినదిగా వార్తనంపెను. అంత నా నిశాచరుండు పగతునితోఁ గలహంబు గట్టిపెట్టి సంభ్రమంబున నాద్వీపంబునకుం జని, మాపేటిక నెప్పటియట్లు తన గర్భంబునం దాల్చి, వచ్చి, లంకేశ్వరుపాదంబులకడనుంచి, నమస్కరించి

నిలువంబడియె.

అంతట రావణానుజ్ఞాతుండై కుంభాండుండను నిశాచరుం డాపేటిక మూతం దెఱచునప్పటి కందు పురోహిత యుతంబగు కౌసల్యా దశరథుల పాణిగ్రహణ మహోత్సవం బెల్లరకుం దెల్లంబుగఁ గనంబడియె.

అంతట రావణుని మనంబున నద్భుత విషాదంబులు ముప్పిరిగొన నిర్వేఱపాటున గొంతవడి దిలకించి, నక్రముఖుంజూచి క్రోధారుణంబులగు నేత్రంబుల బొమముడిపాటులు సెలంగ నిట్లనియె. ఓరీ! నక్రముఖా! నీ వొనరించిన యక్రమం బెద్దియేని యుండనోపు. కాకున్న నీగర్భంబునను న్న యీపేటికాంతరంబున కీపురుష సమావేశంబెట్లు సిద్ధించు? జరిగినదెల్ల యథార్థంబుగ వచింపలేని వధార్హుండవగుదువని న నాతండు గద్గద స్వరంబునఁ దానాపెట్టియను, దివ్వెగట్టున నునిచిన మనవి సవినయంబుగ నెఱింగించెను. అది విని నారదుండు, రావణా! యిది దైవయోగంబు. నీవిప్పు డెవ్వరియెడ నెట్టి యాగ్రహంబు వహింపఁ బనిలేదు. ఎన్నఁడో జరుగంబోవు ననర్థంబునకు నేఁడే ప్రతిక్రియఁ జేయన క్కరలేదు. నరుల నరిసెముక్కలవలె నమలంగల నీకొక నరునివలన దొసఁగు బొసఁగుననుటను నీవు విశ్వసించుటకు నాకు వింతయగుచున్నయది. చాలుఁజాలు. నీవిట్టిచింత నావంతయేని స్వాంతంబునకుం దగులనీయకుము. అయినను

ననర్థహేతువగు నీపేటిక యిటనుండం దగదు. ఇదినీకు సేమంబుగాదు. కావునఁ దత్క్షణంబ దీని నీసేవకులచే నయోధ్యం బెట్టించి సుఖంబుండు మనవుడు, నట్లచేయుదునని కుంభాండుని కానతిచ్చిన వాఁడు, మహాప్రసాదంబని యారాతనపుఁబెట్టియం దలఁదాల్చి భద్రంబుగ నయోధ్యంజేరి యట నర్థరాత్రంబునడించి తన నివాసంబునకుం జనియె.

అంతకుమున్న సరయూనిమగ్నంబగు నౌకనుండి వసిష్ఠాదులగు మునులు తమయోగబలంబున జలంబుల నుత్తరించి యయోధ్యం జేరిరి. దశరథుని బంధుమిత్రపరివారంబులును, విధిబలంబున నపాయంబుఁ జెందక నిజనివాసంబులకుం జనిరి. మరునాఁడు వేకువనెల్లరు దశరథునికడకుం జనుదెంచి యవ్వధూవరుల గుణాగుణంబులం గాంచి రాజమార్గంబున మంగళతూర్యనాదపూర్వకంబుగ నూరేగించి రాచనగరునఁ బ్రవేశంబు సేయించిరి. సన్న్యాసులు మంగళాశాసనములతోఁ గౌసల్యా దశరథులకు యథావిధిగఁ బరిణయ మహోత్సవంబు సేయించిరి.

# 13. తానొకటి తలంచిన దైవము మఱి యొకటి తలంచును.

—:0:—

తే॥ గీ॥ ధర్మపద్ధతిఁబోవని దుర్మతులను
దమ యధర్మమె శిక్షించుఁ దప్పదెపుడు
తానొకటి మానవుఁడు మదిఁ దలఁచుచుండ
దైవము మఱొండు డెందానఁ దలఁచుచుండు॥

ఇప్పటివలెగాక పూర్వము మనదేశమున జన సామాన్యమునకు విద్య చాలకొఱవడి యుండెడిది. విద్యావ్యాపనమున కవకాశములుగూడ జాల దక్కువగనుండెడివి. గ్రంథసామగ్రియు మిగులఁ గొఱది. కావున విద్యాభిలాషు లెవ్వరో యొక గురువునొద్దకుఁబోయి కాయకష్టములకోర్చి వారి సేవించి విద్య గఱచుచుండెడివారు. కఱచు విద్యయెల్ల జిహ్వాగ్రమునందుండవలెను. గ్రంథము లొకరి ప్రతినుండి యొకరు స్వయముగ వ్రాసికొని చదువవలయును. అట్టి గ్రంథములకొఱకు దాతల నాశ్రయింపవలెను. వారియొద్దనే యుండి యాగ్రంథముల వ్రాసికొనవలెను. పరగ్రామనివాసము చేయవలెను. భోజనాది వసతుల కాయాసపడవలెను. పురుషుల గతి యిట్లుండ నిక స్త్రీలయందు విద్యావ్యాప్తి కసలే యవకాశము లేదని వేర వ్రాయనక్కఱలేదుగదా?

గురువుల కుటుంబభారమును భరించి, వారిం గొనివచ్చి, యాస్థానములయందుంచి విద్య నేర్పించెడి యేమహారాజుల కుటుంబములోని మానినులకో విద్యాలాభము గలిగెడిది కాని, సామాన్యకుటుంబములయందలి మందగమనల కందఱి సారమయిన నించుక లభించెడిదికాదు. అక్కాలంబున రాజులకుఁగూడఁ బండితులన్నఁ బరమాదరము. వారెయ్యది సెప్పిన నది వేదవాక్యము. వారే భూలోకదేవతలని పూజించుచుండెడివారు. వేయేల? యాహారనిద్రాది వ్యవహారంబులఁగూడ వారి యానతిం దలఁదాల్చి మెలంగుచుండెడివారు.

అట్టియెడఁ గుంతలదేశాధిపతియగు వసంతవర్మయను రాజేంద్రుఁడు సంతతి లేక చిరకాలం బీశ్వరారాధనంబునఁ గాలంబుపుచ్చి, దైవానుగ్రహంబున నొక్క పుత్రికంగనియె. ఆబాలిక చంద్రికళవోలె దినదినాభివృద్ధిం జెందుచుండుటం జేసి కళావతియను సన్వర్థనామంబిడి యల్లారు ముద్దుగాఁ బెంచుకొనుచుండిరి. ఆమె విద్యాభ్యాస వయస్కయయ్యెను. సకలవిద్యాపారంగతుఁడగు సోమశర్మయను పండితు నొకరుని బహుమానపూర్వకంబున నారాజేంద్రుండు కొనివచ్చి తన యాస్థాన పండితునిగఁ బరిగణించి గృహోపకరణాది వసతుల నేర్పఱచి తన పట్టణంబున నివాసంబు సేయించి తన గారాబుపట్టి నాయంతర్ముఖునిచెంత విద్యాభ్యాసంబున

కు నియమించె. అక్కన్య యనన్యసామాన్య శేముషీ విశేష విభాసితయై భయభక్తి వినయాది సద్గుణములకు నిధానమై దినదినంబును గురుసదనంబునకుంజని పనిబూని చదువుకొనుచుండెడిది. సోమశర్మ యీబాలిక కక్షరాభ్యాసము సేయించి వర్ణసమామ్నాయమును బోధించెను. పిమ్మట ద్వ్యక్షరత్ర్యక్షరచతురక్షరాది పదముల నేర్పి పుస్తకముం బట్టించి వాచకముఁ జదివించెను. తరువాత సంస్కృత శబ్దముల వల్లెవేయించి బాలరామాయణముఁ బఠింపఁజేసె. శ్రీమద్రామాయణముం జెప్పుట కారంభించి పూర్తిగావించె. అనంతరమున నైఘంటికజ్ఞానముం గలిగించి కావ్యములను, నాటకములను, చంపూగ్రంధములను, నలంకార పుస్తకంబులను జదివింపఁజేసె. విద్యాభ్యాసావసరంబుల నాపెచేయు సంప్రశ్నముల కుత్తరంబులు సెప్పుటకుం దనకే, దుర్బోధమగుచుండెడిది. ఆమె యసమానధారణా పాటవంబునకు గురువు మిగుల నబ్బురపడుచుండును. ఈయలంకారవతి నెవ్వఁడు చెట్టవట్టునో వాని భాగ్యము వర్ణనాతీతముగదా? యనుకొనుచుండును. తగిన యన్నములోనికిం దగినకూర దొరకదనునట్లీ కళావతికిం దగిన మగఁడు దొరకునో దొరకఁడోయని చింతించుచుండును. ఇట్లు కొంతకాలంబేగునంత కాలతాంగికి యౌవనావిర్భావంబుగలుగుటంజేసి విద్యాభ్యాసంబునందలి యభినివేశంబు క్రమంబుగ సన్నగిల్లఁ

జొచ్చెను. గురుగృహంబునకు రాకపోకలు తగ్గించెను. పిమ్మట నాపె తలిదండ్రులు, తమ కొమరితకు నిష్కపట ముగ శ్రద్ధాళువై విద్యఁ గఱపిన సోమశర్మకు గురుదక్షిణ నొసంగవలయునని నిశ్చయించి బంగారుపళ్లెరంబున వేయి సువర్ణ ముద్రికలును, చీనిచీనాంబరంబులును, శాలువులును, కుండలాది సువర్ణాలంకారంబులును, ఫలపుష్పతాంబూలా దులును, చందనఖండంబులు మున్నగు గౌరవార్హంబులగు కానుకలుంచి, కళావతిం దిలకించి, యమ్మా! గురువు పితృ సమానుఁడు, విద్యాదానముఁ జేసిన మహానుభావుఁడు. సర్వ దాశిష్యజనములకుఁ బూజ్యుండు. ధనదాతకంటె జ్ఞానదాత యత్యుత్తముండు. జ్ఞానము మూఁడవనేత్రమువంటిది. అట్టి జ్ఞాననేత్రములేనివా రంధప్రాయులు. మంచి చెడుగుల బో ధించుచు జీవనయాత్రయం దనుక్షణంబును, విశ్రాంతి స్థాన మగునది విద్య. సౌఖ్యము నొసంగునది చదువు. దుఃఖంబుల నెల్ల దూరముచేయునది సారస్వతము. అట్టి యత్యుత్తమం బగు విద్యానిధానము సోమశర్మ నీకనుగ్రహించె. నీకతండు సర్వదా పూజ్యతముండు. ఆతని ఋణమెన్ని విధముల నైన మరలించుకొనఁ జాలము. అయినను మనశక్తికొలఁది గురు వునకు విద్యాదానంబునకుందగు పారితోషిక మొసంగవల సియున్నది. కావున నీభూరిదక్షిణంగై కొనిపోయి గురుపాదం బుల సన్నిధినుంచి, నమస్కరించి, యాశీర్వాదంబులఁబడసి

శెలవు గైకొని రమ్మని యా సువర్ణభాజనంబు నాలతాంగి హస్తపద్మంబున నుంచుటయు, నాకళావతి పరితోషంబునం గైకొని వెడలి గురుగృహంబునకుం జని యాసోమశర్మ పాదంబులకడ నాపళ్లెరంబుంచి నమస్కరించి, ఆర్యా! కొండంత దేవునికి గోరంత పత్రియన్నట్లు నేనొసంగిన యీ యల్పంబగు దక్షిణ నంగీకరించి యాశీర్వదించి శెలవొసంగి నన్ను గృతార్థురాలిం గావింపవేడెద. అనుటయు నాపండితుం డయ్యండజయాన యఖండ సురూపసౌందర్యాదుల కచ్చెరువడి మోహావేశంబున నిట్లనియె. తోయజాక్షీ! నీకిది న్యాయమే? ధనము నపేక్షించి నీకు నేను విద్యగఱపితినా? నాకిది ప్రధాన ప్రయోజనంబుగాదు. నీకు విద్యావినయంబులు నేర్పి నీవలన సంసారసుఖంబుల ననుభవింపఁదలంచితిని గాని యీస్వల్పలాభంబును నేఁగోరలేదు. కావున నాయాజ్ఞానుశారిణివై నాకు గృహిణీధర్మము నవలంబింపుమనియె. అమ్మాటల కాబోటి చిత్తంబునఁ జింతించి, గురువగుటం దిరస్కరింపనేరక యిట్లనియె."అంతర్ముఖులకిది ధర్మముగాదు. విద్యాదాతయు, నన్నదాతయుపితృసమానులు. నేను మీకు బుత్రికవంటిదానను, సౌశీల్యము మీరే గ్రంథమూలముగ నాకు బోధించి, నన్ను గామించుట చాల శోచనీయము. మీకార్యధర్మములను నేను బోధింపవలంతినిగాను. ఇయ్యది కేవలమును నింద్యము. నన్ను వాత్సల్యంబునఁ దిలకింపందగు

ను గాని వాల్లభ్యంబునఁ జూడందగదు. సద్విషయంబులఁ దమయానఁ దిరస్కరించుదానంగాను. ఇది యసద్విషయము. నాభావ్యభివృద్ధింగోరి కుమారికవలెం దలంచి దీవింపుఁడు. పండితమండనులగు తమ చిత్తంబున నీప్రాకృత విషయంబులకుఁ జోటీయందగదు. గురుశబ్దంబునకుఁ దండ్రియను నర్థముఁ గల్పించిన తొల్లిటి మహనీయులు వందనీయులు. నేఁ బోయివచ్చెద సెలవొసంగుఁడు." అనిన నాసోమశర్మ నీకిది ధర్మముగాదని యావనితకరంబునట్టిన నామె తప్పించుకొని తిన్నగఁ దనరాణివాసంబునకుం జనియె. సరియే? పొమ్ము. నీ గర్వంబునకుం దగిన ప్రాయశ్చిత్తంబునేగావించెదగాక యని దురాగ్రహాగ్రస్తుండై పట్టుతప్పిన యురగంబువలె నిట్టూర్పుపుచ్చుచు, సమయంబునకు వేచియుండెను. ఆ బాల సుశీల యగుటం జేసి తనకుం జరిగిన పరాభవమునింట నెవ్వరికిం జెప్పినదికాదు. అంతఁ గొంతకాలంబున కా కాంత పుష్పవతియగుటయు, నక్షత్రాదికంబుం బరిశీలించుటకు రాజేంద్రుండు సోమశర్మకు వార్త నంపించెను. అంత నీ పండితుండు రాజాస్థానంబునకుం బోయి రాజానుజ్ఞాతుండై యా రాకన్నియ యార్తవతిథివారాదులం బరిశీలించి మీనమేషంబుల లెక్కించి మొగంబున విన్నదనంబుదోఁప మిన్నకుండెను. ఆతని ముఖవైఖరిం బరికించి కొంచము సందియంబున రాజేంద్రుండు, ఆర్యా! ఏమట్లు విచారించుచు

న్నారలు. ఎద్దియేని దోసంబున్న శెలవొసంగుఁడు. శాంతి నొసరించుకొందుము. నావుడు రాజేంద్రా! ఈదోషం బె న్ని శాంతు లాచరించినను నివర్తించునదికాదు. మహాదో షము. ఈ నక్షత్రదోషంబున ఋతుమతియగు నతివగల గృహస్థులందఱుఁ గ్రమక్రమంబుగ నశించెదరు. ఐశ్వర్యం బెల్ల నంతరించు. ఆపదలు కాపురంబుసేయు. ఈదోషంబుప శమించుట కొక్క శాంతి క్రియగలదు. అయ్యది ప్రత్యక్షం బుగ నీకు వచించుటకు నాకు నోరాడకున్నయది. అనుట యు రాజు భయవిచారంబులు మనంబునఁ బెనంగొన నిట్ల నియె. అయ్యా! మీరు మాకు పరమదైవమని భావించుకొ నుచున్నారము. నాసేమముంగోరి యేమియు సంశయింపక, కలతెఱంగంతయు నానతీయవలయును. ఎట్టి కష్టంబైన నీ దోషమును బాపుకొనఁదలంచితిని. నిశ్శంకముగ యథార్థ ము వచింపుడని ప్రార్థింప, నానిర్దయుడిట్లు వచించెను. నీ కుమారిక నొక పెట్టియంబెట్టి, నదీమధ్యమంబున విడువవల యు. ఇయ్యదియ, దీనికిఁదగు శాంతికర్మము. చిరకాలము విద్యావినయాదులు గఱపిన నేనే నామాటలతో నిట్లు వచించుటకుఁ జాలచింతించుచున్నాఁడను. అడిగినప్పుడు యదార్థము వచింపవలయుగావునను, ప్రభులసేమ మాశ్రి తులకు ముఖ్యమగుటను జెప్పకఁ దప్పినదికాదు. కావున నీవీ యర్ధరాత్రింబున నీశాంతివిధానంబు నడిపింపవలయును. దీని

కాలస్యము సేయందగదు. అనవుఁడు తేఁడు దుఃఖాక్రాంతుండై పుత్త్రికామోహంబునఁ గొంత చింతించి కన్నుల బాష్పకణంబులురాల నట్లసేయుమనని యంతఃపురంబునకుంజని తనరాణింగాంచి యీ దుఃఖవార్త వచించెను. ఆరాజదంపతులుపరిపరివిధంబులవాపోయి, వాపోయి, చేయునదిలేక పుత్త్రికామోహంబువిడువంజాలక నిద్రాపరవశయగు తనయం గౌఁగలించుకొని దుఃఖించి మంతనంబున నొక సేవకుని రావించి, యొక మందసంబున రత్నాలంకారాలంకృతయగు నా సుందరీరత్నంబునుంచి యీ పట్టణప్రాంతంబునందలి నదీమధ్యమంబునం దీని విడుమనిననతండట్లు గావించె.

ఇట సోమశర్మ తాను చేసిన మోసంబునకు సంతసించుచు, నదీప్రవాహమార్గంబున నిర్జనప్రదేశంబునకు దూరంబుగఁ బోయి తీరంబున మందసంపు రాకకై వేచియుండెను.

ఈ నడుమ విజయసేనుండను రాకొమరుం డొక్కఁడా రేయి నరణ్యంబునకు మృగయావిహారంబున కేతెంచి క్రూరమృగంబుల సంహరించి ప్రాతఃకాలంబున కానదీతీరంబునకుం జనుదెంచుటయు, నా పేటిక యాతని కంటంబడిన సేవకులచే దాని దెప్పించి పిధానంబుం దెఱచిచూడ సుందరి నిద్రించు రాకన్నియ నతని కన్నులం బడియె. అంత నాపెయుఁ మేల్కని తన కర్మగతికిని, గురుని మోసంబుం

కును, రాజపుత్రసందర్శనంబునకును, నద్భుతవిషాద సంత సంబు లొక్కపరిమాణసంబుం గలంచుచుండ నారాజసూనుండామె నోదార్చి చేయూత యొసంగి యామెం దీసి నీచరిత్రంబు వచింపుమని యనేకవిధంబుల బోధింప నెట్టకేల కాకుటిలాలక యాగురుని కుటిలంబున నింత పుట్టెనని తన యుదంతం బాద్యంతంబుగ నాతనికి వచించెను. అంత నా విజయసేనుండు దీనికిఁ జింతినొందకుము. దైవంబు ధర్మంబు నంగలండు. నీకు భయంబులేదు. నిన్ను భద్రంబుగ నీ జనకుని సదనంబునకుం జేర్పించెద, నాతోడ రమ్మనిన నామె, రాజనందనా! నేనిఁక గృహంబునకుం జననొల్ల. ఒక్క కుటిల చిత్తుని మాటవిని మోసంబని గ్రహింపక చిరప్రార్థితంబగు సంతానంబనైన నాయందలి ప్రేమంబును నైతిము దూరముగ ద్రోచి నన్నర్థరాత్రింబున నవిచారితుండై నదిం ద్రోయించిన పరాధీనుండగు రాజుపుత్రికనని చెప్పకొనుటకుంగూడ సిగ్గిలుచున్న నేనారాజు గృహంబున నెట్లు నివసింతును. ఇఁక నేటితో నాకు నాపుట్టినింటితో ఋణము తీరినది. నేనయ్యెడకుఁ బోవంజాల. కీడులో మేలొనఁగూడినట్లు నాభాగ్యవశంబున నీదర్శనంబు లభించె. నాకు నీవు ప్రాణదాతవు. కావున నాప్రాణేశ్వరుండవని భావించుచున్న దానను. దయామయుండవగు నీవు నాప్రార్థనం బంగీకరించి నన్ను జేపట్టిన, సంతొసంబున నిరర్థాంగినై తోడునీడవోలె సం

చరించి గృహిణీధర్మంబునిర్వర్తించుకొనియెదను. లేదేని యీ నదీప్రవాహంబున కాత్మార్పణంబుఁ జేసికొని జీవయాత్రకు స్వస్తి చెప్పుకొందును. ఇదియ నానిశ్చయము. నాయీ ప్రార్థనంబు నీకు ప్రతిబంధకంబగునెడల మోమోటమిలేక యున్నదున్నట్లు వచింపందగు. నీఋణంబు నేనెన్ని జన్మంబులకైన నీగంజాలుదునే?యని బాష్పకణంబులు కపోలఫలకంబులంజార నేడ్చుచున్న యయ్యన్నులమిన్న మృదుమధుర వాగమృతంబు కర్ణపుటంబుల కాప్యాయనంబుఁగల్పింప నిశ్చేష్టుండై విని చిత్తంబున జాలిగదుర "తరుణీ! నీ చిత్తంబునకుం దగిన తెరువున నడువుము. నీప్రార్థనంబునకు నేనెన్నండును వెనుదీయువాఁడఁగాను. నిన్నుఁ బరిగ్రహించుటకు నాకెట్టి యాటంకంబును లేదు. నీయిచ్చవచ్చిన చొప్పున మెలంగుదును. ఇంతదనక, నేనవివాహితుండను. నీవు నాకు ధర్మపత్నివేగాక పట్టమహిషివియు నగుదువు. నీయాభిజాత్యము నాకుసంతసంబు గల్పించె. నాకెట్టి సందియంబును లేదు. నీయట్టి యుత్తమకులీనయు, విద్యావతియు, భువనమోహినియునగు నిల్లాలు లభించుటకు నేను తొలిజన్మంబున నెట్టి గట్టుల దిట్టతనంబునఁ దపంబాచరించితినో గోచరింపకున్నయది. నన్నాపత్సముద్రంబునుండి యుద్ధరించిన యీ కరంబు, నీకు గార్హస్థ్యధర్మమార్గంబున నిరంతరంబు సౌఖ్యాకరంబగుఁగాక! రారమ్మ"ని తన జవనాశ్వంబుపై నా

మెం గూర్చుండఁ బెట్టుకొని, యాపెట్టియ నొక భల్లూకంబుఁ బెట్టించి నదీ ప్రవాహంబునకు నెట్టించి, యథేచ్ఛంబుగ సపరివారుండై నిజనివాసంబునకుం జనియె.

సోమశర్మయు నామందసంపు మందగమనంబునకు విసువునొంది తహతహపడుచుండఁ గొంతవడికి దూరంబుగ ప్రవాహమార్గంబునఁ గొట్టుకొనివచ్చు నాపెట్టియుంగాంచి యభిముఖుండై పోయి తన శిష్యుల, నదినిదించి దాని నొడ్డు నకుం దోయించికొనివచ్చి యొడ్డునంబెట్టి ప్రొద్దుగ్రుంకు దనుక నటఁగాచియుండి శిష్యసహాయంబున నారాత్రి యా పెటికిం దన గృహంబున నొక గదిం బ్రవేశంబు సేయించి, శిష్యులంబోవ నానతిచ్చి తన మనంబున నిట్లు వితర్కించె ను. మందసంబు గదలింపఁ భారంబై తోఁచెడిని. లతాంగి యగు సఖ్యాబల యింత భారంబై తోఁచుటకుఁ గతంబు తోఁచకున్నయది. ఒకటి కానొప్పు. లేకలేక కన్న కొన్నగుట దనయా వియోగము సహింపఁజాలక ప్రేమపాశంబుం ద్రెం పుకొనలేకఁ దలిదండ్రులు నాపెట్టెతోఁ గూడఁ గొన్ని రత్నాభర ణాదులును, ధనంబుమున్నగువాని సమందసంబునఁ బొందు పఱచియుండఁబోలు. కానిచో నింతభారంబునకుఁ గారణంబు మఱియొండు గానరాదు. ఇక్కాంతిక నా సనకేఁ గొంతపశ్చా త్తాపము జనింపవచ్చును. అయ్యానముంగాక యుప్పవలముత్తు లనుక్షణమును మారుచుండును. కావున నాయందనురాగ

మయినఁ గలిగియుండవచ్చును. లేదుపో? నంటయింటికుం దేలిది యిఁక నెచ్చటికిఁ దప్పించుకొని పోవఁగలదు. ఎట్లయిన నీభామిని నాకామిని. నాకోర్కె నేటిలోఁ బడినది. ఒరులెవ్వరు దరికిఁ జేరకుండఁ దలుపులు బిగించి యీకాంతననునయించి యొప్పియున నంగీకరింపఁజేసి స్వాధీనగాఁ జేసికొనియెదంగాక! యని నిశ్చయించుకొని, కవాటంబులు బంధించి, యంధకారబంధురంబగు నాగదియందలి మందసంపు బీగంబుఁ దెఱచి యందుఁ జేయిఁ జొనిపిన బిరుసు వెండ్రుకలు చేతికిఁ దాఁకెను. అభ్యంగన మొనరించిన చమరీకచ శిరోజంబులుగా దలఁచి, లేలెమ్ము. మానంబు వహింపకుము. నాపాణిం గ్రహించి కంఠాలింగనంబు గావింపుము. జాలమేల? నాకు నీవు ప్రాణేశ్వరివి నాయుఃప్రాణంబులతో నేను నీయధీనుండను. నీవు కసుంగడు నాకలిఁగొనియుందువు. రుచ్యంబగు నాహారంబుం గ్రహింపుము. అని చేతికిం దొరకిన కేశంబుల గ్రహించి లేవఁదీయ యత్నించెను. అంత క్షుధాతురంబగు నావృక్ష భల్లూకంబు గాండ్రుమని లేచి నిగయద్వారంబు బోలిన తన వక్త్రంబుం దెఱచి యాతని భుజంబులం బట్టుకొని, నఖభీకరంబగు తన ముంగాలిచే నాతని కంఠాలింగనం బొనరించి మాంసంబు జీల్చి యాతని యాసనసంబున కనిచి యాప్యాయనంబున భుజించె.

---

# 14. పెద్దల నవమానించుట ప్రాణహాని దెచ్చును.

—:0:—

కం॥ ధరణీఖండము నెల్లెడఁ
బరిపాలన మాచరించు పార్థివుఁడైనన్
బరమపవిత్రుల నవమతి
పఱచిన నాయుష్యహాని వడయుటయరుదే?

పూర్వకాలమున భరతఖండమును బరీక్షితుఁడను మహారాజు పాలించుచుండెను. ఆతఁడు ధర్మబుద్ధితోఁ బ్రజలనుగన్న బిడ్డలవలెఁ గాపాడుచుండువాఁడు. ఒకనాఁ డాతఁ డడవికింబోయి క్రూరమృగంబుల వేఁటాడి దప్పిగొని శమీకుఁడను నొక ముని యాశ్రమంబునకుంబోయెను. ఆముని వరుండు తపోనిష్ఠం దగిలియుండుటచే నీతనికిం దగు సత్కారమొనర్చియుండలేదు. దప్పిబాధచే తహతహలాడు నీతేఁడు, ముని తనరాక నెఱింగియు, నెఱుఁగనివానివలె నటించుచుఁ దనకుఁ బానీయంబులిచ్చి గౌరవింపలేదను కోపమున, నాతని తపోమహత్వము నెఱుంగఁగోరి, యటఁ జచ్చి పడియున్న యొక పామును దన వింటికొనతో నెత్తి యాతని బుజముపయింబెట్టి పోయెను.

ఈవిషయమును దూరమునందున్న శృంగియను, నమ్మునికుమారుఁడు కొందఱు మిత్రులచేవిని వచ్చి, యా పాముంగాంచి, కోపించి, యిట్లు మాఁ తండ్రి నవమానించిన రాజు, నేఁటి కేడవదినమునఁ బాముచేఁ గఱువఁబడి చచ్చు నని శపించెను. కొంతనడికా శమీకమునీంద్రుండు తపము చాలించి కన్నులు దెఱచిచూచి తన భుజమునందలి సర్పశవ మును దీసి పాఱవైచి, తన పుత్రుంగాంచి, నాకంఠభాగమున కీసర్పమెట్లు వచ్చినదని యడిగెను.

పరీక్షితుఁడను రాజువచ్చి యాసర్పశవమును వైచె ననియు, నాతనిపని కేడుదినములలోఁ జచ్చునట్లు శపించితి ననియు నాతఁడు తండ్రికిఁ దెలియఁజెప్పెను.

అందులకు శమీకుఁడు సాలఁ జింతించి యయ్యో! కుఱ్ఱా! యెంత పాపకార్యముచేసితివి? ఆమహారాజు పరమ పుణ్యుఁడు. వైష్ణవభక్తాగ్రేసరుఁడు. కృష్ణుఁడీలోకమును విడి పోయినను, లోపములేకుండ ధర్మదేవతను నాలుగు పాదము లచే నడపించుచు రాజ్యమేలుచున్న ప్రజారంజకుఁడు. అతని కెంతయాపదఁ దెచ్చితివి? లోకమున కెంత యపకారమొన ర్చితివి? న్యాయమార్గమునఁ బాలించు రాజు లేకున్న మన తపములుమాత్రము క్రూరులు సాగనిత్తురా? అతని ద్రోహ మునకు మించిన శాపమిచ్చితివే? శపించుటయే గాని యుప సంహరించుటకుం దగుశక్తి యింకను నీకలవడలేదే? నేనిప్పు

డేమి చేయుదును? కొలంది యపకారమునకు ఘోరశిక్షవి ధించిన పాపఫలము నఙ్గుడనగు నీద్వారమున నేననుభవింపవలయుం గాబోలునని తనయుని మందలించి, యీవార్త రాజునకు మున్నుగ నెఱింగించుట యొప్పునని భావించి తన శిష్యునొక్కనిం బిలిచి యారాజున కీవృత్తాంతముం జెప్పి రమ్మని పంపెను.

అంత నతండా భూపాలుని కడకుంజని తనగురుని యానతిని విన్నవించెను. అందుల కామహీపతి మహాపరితాపమున, నక్కటా! యెంత తెలివిలేనివాఁడనైతిని? మహాత్ముల కపరాధముచేసిన పాపము వ్యర్థముగఁబోవునే? నాకుం దగినశిక్ష లభించినది. ఎన్నఁడును లేని యీవిపరీత బుద్ధి వినాశకాలమునకు నాకుఁ గలిగినది కాబోలును. అని చింతించి, తనరాజ్యమును గుమారుఁడగు జనమేజయుని కొప్పగించి వైరాగ్యమున నీయేడుదినములును గడపి, యీశ్వరధ్యానపూర్వకంబుగ దేహమును విడిచి కైవల్యముం జెందెదఁగాక యని యొక నదీతీరమున నిరాహారుండై యుండెను.

ఈ వృత్తాంతము నెఱిఁగి మునీంద్రులెల్లరు నారాజర్షి సమీపమునకు విచ్చేసిరి. వారిలో శ్రీశుకుండను మహర్షిం గాంచి యారాజచంద్రుఁడు, "మహాత్మా! ఏడు దినముల లో ముక్తిబొందు నుపాయ మేదయిన నున్నయెడలఁ నాకుం

జెప్పి కృతార్థు నొనర్పవలయును." అని ప్రార్థించెను. అంత నమ్మునివరుండు వల్లెయని, తొల్లి తన తండ్రియగు వ్యాస భగవానునిచే దనకుపదేశింపఁబడిన శ్రీమద్భాగవతము నాతని కుపదేశించెను. దానిచే నారాజర్షి కృతార్థుండై నిర్యాణమున కెదురు సూచుచుండెను.

ఇంతలోఁ దన తండ్రికిం గలుగనున్న యాపదను బ్రయత్నముతో నివారింపవలయునని యెంచి జనమేజయుఁ డొక సముద్రమధ్యమమున నొంటికంబ మొకటి గట్టించి దాని పై నొక సౌధమును నిర్మింపఁజేసి తండ్రియగు పరీక్షిత్తుని సప్తమదివసంబున నందుఁ బ్రవేశంబు సేయించె.

విప్రశాపప్రేరితుండై తక్షకుండను సర్పరాజు నాఁడు పాతాళమునుండి బయలువెడలి యొక గుహ్యమార్గమునఁ బడి వచ్చుచుండెను. అంతకుముందు మంత్రబలముచే సర్పదష్టుఁడగు రాజును బ్రదికింపఁజేయ సమర్థుండగు కశ్యపుఁడను దేవమాంత్రికుని దేవేంద్రుండు స్వర్గమునుండి పంపించెను. ఆకశ్యప తక్షకులిరువురు నాయాపథంబడి వచ్చుత్రోవలోఁ గలిసికొనిరి. వారిరువురకీ క్రిందిసంభాషణము జరిగెను.

తక్షకుఁడు:-అయ్యా! నీవెచ్చటినుండి వచ్చుచుంటివి? ఎచ్చటి కేగెదవు?

కశ్యపు:-స్వర్గమునుండి వచ్చుచుంటిని. హస్తిపురమునకుఁ బో వలయును.

తక్ష:-ఎందులకు?

కశ్య:-పరీక్షితుఁడను రాజ చంద్రుఁడు నేఁడు తక్షకసర్పము చేఁ గఱువ బడునఁట. నామంత్రబలమున నాతని రక్షింపఁగోరి పోవుచుంటిని.

తక్ష:-(నవ్వి) తక్షకుఁడు కఱచుటయును, నీవు బ్రతికించుట యునా? ఎంతవింత?

కశ్య:-ఏమి? బ్రదికింపనే లేనుగా?

తక్ష:-కాఁటు పడినపిమ్మట రూపముండినఁగదా? మంత్రశక్తి యుపయోగము?

కశ్య:-రూపమేయుండదా? తక్షకుని విషమంత తీవ్రమయిన దేమి?

తక్ష:-అది విషమని పిలువఁబడు కాలాగ్ని. ఒక్క రక్తబిందు న నదిచేరినమాత్రమున భస్మము సేయును.

కశ్య:-భస్మమైన నుండునా?

తక్ష:-అదువలనఁ బ్రయోజనమేమి?

కశ్య:-అదియున్నను జీవింపఁజేయుటకు నాకుఁ జాలును.

తక్ష:-మంత్రశాస్త్రమున నంత నిపుణుఁడవా? ఏది? చూత ము? నేనే తక్షకుఁడను. ఈమఱ్ఱివృక్షముం గఱచెద ను. బ్రదికింపుము? (అని చెట్టును కాఁటువైచినఁ జెట్టు భస్మమయ్యెను.) కస్యపుఁ డాభస్మమును జేర్చి యందుఁ దన కమండలూదకమును మంత్రించి

ల్లెను. అంత నావటవృక్షము, తన కొమ్మలయందుం
డి. యాకులుగోసికొనుచున్న విప్రునితోఁగూడఁ
దొల్లిఁటి యట్లు జీవించెను. అదికని తక్షకుఁడు భీతి
జెంది, విప్రముఖ్యా! నీమహిమకు సంతసించితిని.
కాని యిది బ్రాహ్మణశాపము తప్పించుట నీకు ధ
ర్మముకాదు. విధి యిట్లున్నది. కావున నీ కమూల్యం
బులగు మణులనొసంగెదను. ఈయత్నమునుండి
తొలంగుమని యాతని కనేకరత్నము లిచ్చి వెనుక
కుం బంపివైచి, తాను సముద్రతీరంబునకుం జని సు
వర్ణమయంబగు నిమ్మపండు నాకారంబుధరించి, కడ
లి జలంబుండఁగాంచి రాచనగరు దరికరిగి, నరపతిని
క్షోభింపఁజేసి యాతని కడకుం గొంపోఁబడి, తిన్నా
ఘ్రాణించు నాతని సర్పాకారముసం గఱచి పంచ
త్వంబునొందించెను.

---

# 15. "మాట తిరుగ లేరు మానధనులు."

—:0:—

ఆ॥ వె॥ జీవనంబును ధనమును జెడినగాని
యెడ తెగని కష్టముల మెన్నిపడినఁగాని
బహువిధంబుల నవమానపడినగాని
మాటఁ దిరుగంగఁజాలరు మానధనులు॥

ప్రహ్లాదుని మనుమఁడగు బలియను నొక రాక్షస రాజు దేవేంద్రాది దేవతలను దన బాహుబలమున జయించి ముల్లోకములకును దాన చక్రవర్తియై లోకములను బాలించుచుండెను.

ఆతఁడు సకలలోకములను జయించి సంపాదించిన ధనముతో ననేక యజ్ఞము లొనర్చి విశేషముగ దానధర్మములఁ జేసి వదాన్యశిఖామణియను కీర్తిని సంపాదించెను. అడిగినది తడవుగా కోర్కులనిచుటలో పుసుకుదుసుకుగూడ నాతని కీసు రాదనుట, యతిశయోక్తి కాదు. అయిననేమి? సురల నతండు పురమునుండి తరిమి గిరికందరములు శరణ మొనర్చి పరశత్రువయ్యెను.

అందుచే నాకులు బృందారకులు నిందిరాపతికిం దమగుందుం దెలుపుకొనిరి. అదితికశ్యపులకు బుత్రుఁడనై పుట్టి మీయాపదఁ దొలంగింతును చింతింపకుడని దేవతల నోదార్చి యానారాయణుఁడు వామనరూపమున నొక పుణ్యదినంబున నదితిగర్భమున జననమందెను. అట్లు జన్మించిన కొమరునికిఁ గశ్యపప్రజాపతి జాతకర్మాది సంస్కారముల నెరవేర్చి యుక్తకాలమున నుపనయనము గావించెను. అంత నాతఁడింపుగ నుపదేశమాత్రమున సకలవిద్యలం గ్రహించి భిక్షాపాత్రముం గైకొని, నానా దేశంబులనుండి వచ్చుచుఁబోవు విప్రులంగాంచి యీ

కాలంబున నడిగిన లేదన కిచ్చుదాత యెవ్వాఁడని ప్రశ్నించెను. బలిచక్రవర్తి కీఁడయిన వదాన్యుం డెందును లేఁడని వారెల్లరుం జెప్పుచుండిరి.

అంతనొక శుభముహూర్తంబునం గదలి నర్మదానది యావలియొడ్డున నూఱవ యజ్ఞముం బూర్తి సేయుచున్న బలిరాజేంద్రుని యజ్ఞశాలలోనికిం బోయి యచ్చటి పండితులతో సమస్తశాస్త్రంబులను వాదోపవాదములతోఁ జర్చించుచు వారలం జయించి, వారెల్లరు నీతని బ్రహ్మవర్చస్సుచేఁ దిరోహితులై వింతతోఁ జూచుచుండ వారలం దప్పించుకొని యగ్నిలో హోమమొనర్చుచున్న రాజుకడ కుంజని యాశీర్వదించి నిలువంబడియెను.

అంత నయ్యజమానుండు లేచి నిలువంబడి యా బ్రహ్మచారికి నమస్కరించి యిట్లనియె. అయ్యా! మీరెచ్చటినుండి వచ్చుచుండిరి? మీ నివాసస్థాన మెయ్యది? మీరేఁబుత్రవంతులైన ధన్యుల నామంబులెయ్యవి? మీరాకచే నేను ధన్యుండనైతిని. నా యజ్ఞంబు పవిత్రంబయ్యె. మీకుం గావలసిన కామితం బెయ్యది? యానతిండు. అది యెద్దియైన నిచ్చుటకు సిద్ధముగ నున్నాఁడను. అనిన నా మాయావటుం డిట్లనియె. రాజేంద్రా! నీవంశంబునకుం దగిన మర్యాద నొసఁగితివి. నాకుఁ గడుంగడు సంతసంబుగలిగె. నేను బ్రహ్మచారిని. నాకొకచోట నివాసమనునది లేదు. అంతటను నేనే

యుందును. సకలవిద్యలును నాకుఁ గరతలామలకములు. తప మొనర్చుకొనుటకు నాయడుగులతోఁ గొలుచుకొను మూఁడడుగులనేల నాకుఁ గావలసి నిన్ను యాచింపవచ్చితిని. ఇంతకంటె నాకు వలయు కామ్యమొకండులేదు. అనవుడు నాబలిచక్రవర్తినగి, అయ్యా! నీవు బాలుండవు. పాపము? అడుగుటయుఁ జేతకాదు. నాబోటి దాతయొద్దకువచ్చి య డుగునదిదియా! చాలుఁ జాలు. ఇంకెద్దియైన నడుగుము. అనిన నింకేదియు నాకక్కఁగ దగినదిలేదు. అడిగినదాని నొసంగి నాకోరికను జెల్లింపుము. అదియే నాకుబ్రహ్మాండము అనిన నానదాన్యశిరోమణి యవ్విప్రబాలకుని పాదంబులం గడిగి భూదానమొనర్ప యత్నించుచుండఁ బురోహితుండగు శుక్రాచార్యుం డిట్లనియె.

రాజా! ఈతఁడు మాయా వటురూపమును ధరించిన యాదివిష్ణువు. ఈతఁడు దైత్యులకుఁ బరమశాత్రవుఁడు. ఇంద్రసహాయార్థము వచ్చినవాఁడు. ఈతని కీదానమియ్య వలనుపడదు. నిన్ను బదభ్రష్టునిజేయును. నామాట నమ్ము మని బహుభంగుల మందలించెను. భూమి తలక్రిందులైనను, సూర్యచంద్రగతులు తప్పినను, ప్రాణాంతమైనను అగుఁ గాక. అన్నమాటఁ దప్పఁజాలను. దాన మిచ్చితీరెదను. విష్ణువని తెలిసిన పిమ్మట ననుకూలమగు పాత్రము దొరకి నందులకు మఱింత సంతసించుచున్నాఁడనని చెప్పి వామను

నికి మూఁడుపాదముల భూమిని దానమిచ్చి యాతనిచే బద్ధుఁడై పాతాళమునకుఁ బోయెను.

---

# 16. దేవుని దీక్షతోఁ బూజింపవలయును.

తే॥ గీ॥ సత్యమును శౌచమును భూతసమితియందు
దయయు శాంతియు ఋజుగతి, నయముభయము
వినయమును దృఢభక్తియు విస్తరించి
నిష్ఠబూజింప నీశ్వరుని దయగలుగు॥

కుంతలదేశమును ధర్మవీరుఁడను నొక రాజపుత్రుఁడు ధర్మమార్గముం దప్పకుండఁ బరిపాలించుచుండెను. ఆతఁడొకదినమున నడవికి వేఁటకుం బోవుచుఁ గొందఱు బోయలను సహాయముగఁ గొంపోయెను. ఆనాఁడు క్రూరమృగముల వధించుటలో నాబోయవాండ్రు రాజునకు జాలసహాయ మొనర్చిరి. రాజపుత్రుఁడు వేట తమకంబున డస్సి తన సేవకులతో నింటికి వెడలివచ్చుచుండ మార్గమధ్యంబున నొక బోయవాని కొక సాలగ్రామము కానుపించెను. వాఁడది చూచి యాతాయి మిగులఁ జక్కగనుండుటచేఁ జేతం దీసికొని దాని నారాజునకుం జూపెను. ఇది శివలింగము.

దీనిని బ్రాహ్మణులు పూజింతురు. దీనిని నీవంటఁదగదు. ఎచ్చట నిది నీకు దొరకినదో మరల నచ్చటనే దీని విడిచి రమ్మని రాజతనయుఁడు పలికెను. బోయవాఁడిట్లనియె. అయ్యా! శివునికి వీఁడు బోయవాఁడనియు, నీయన బ్రాహ్మణుఁడనియు భేదము గలదా? భగవంతుని కందఱును బిడ్డలే. కావున నేను నాచేతనైనట్లు దీనిని బూజించెదను. ప్రయత్నములేకుండ దొరకినదేవుని విడుచుట నాకిష్టము లేదు."

రాజు:-ఓరీ! మూర్ఖుఁడా! దీనిని నీవు పూజించుట మాటలలోలేదు. ప్రతి దినమును స్నానముచేయవలయును. పువ్వులు తేవలెను. మారేడుపత్రి సంపాదించుకొనవలెను. వానితోఁ బూజచేసి దేవునికి నైవేద్యముఁ నియ్యవలెను. పిదప భుజింపవలెను. ఇట్లు తప్పకుండ నిష్ఠతోఁ బూజనాచరింపకున్న నిది యెవనియొద్ద నుండునో వానికి హాని కలుగును. దీనిలో నొక్కటియు నీకుఁ గొనసాగునదికాదు. వృథాయాసపడి, పోయెడి పామును మెడకుఁ దగిలించుకొనకుము. నామాట వినుము.

బోయ:-దొరా! మీరు చెప్పిన వెవ్వియు నాకు దొరుకనివి కావు. ఇది విన్న పిమ్మట నాకు మఱింత యుత్సాహ మెక్కువగుచున్నది. ఏదో నైవేద్యమంటిరి?

అది దేనితోఁ జేయవలయును?

రాజు:-(విసుగుదలతో) ఆ. నైవేద్యమా! వల్లకాటిలోని బూడిద. అని బదులు చెప్పెను.

అంతట నాబోయవాఁడా శివలింగము నింటికిఁ గొని పోయి భార్యకుం జూపి జరిగిన వృత్తాంతమంతయుఁ జెప్పెను. దానికి వానియిల్లాలు సంతసించెను. ఆమరునాటినుండియు మిగుల శ్రద్ధాభక్తులతో నాబోయదంపతులు శివపూజ చేసుకొనుచుండిరి.

ఇట్లు కొంతకాలము గడచెను. శివుఁ డొకనాఁ డీబోయవాని భక్తిని బరీక్షింప దలఁచి యాచుట్టుప్రక్కల గ్రామములందలి శ్మశానములందెచ్చటను భస్మములేకుండ జేసెను. బోయ యాదినమున నైవేద్యభస్మముఁ దెచ్చుటకు శ్మశానమునకు బయలుదేరెను. దొరకినదికాదు. సమీపగ్రామములకుఁబోయి శోధించెను. ఆయాసము వ్యర్థమయ్యెను. పగలు రెండుజాములు దాటినది. ఎండదెబ్బ కొండలుమండి పోవుచున్నది. గ్రుక్కెడు నీళ్లైన గొంతుకలో బోసికొనిన వాఁడుకాఁడు. తిరిగితిరిగి విసివి వేసరి కుతపకాలమునకుం దన గుడిసెకు ఘటముఁ జేరవచ్చి బోయిన నేడువసాగెను. అంత నతని యిల్లాలువచ్చి యేమిది? యని యడిగెను. నా దేవునికి నేఁడన్నమును బెట్టలేకపోతిని. వేళ దాఁటినది. ఎంత యాకలిచే బాధపడుచున్నాఁడోయని యూరితెఁ దుఃఖించెను.

అందుల కామె యిట్లనియె. అయ్యో! దీనికింత చింతయేల? నేను గుడిసెలోనుందును. బయటనుండి మీరు గుడిసెకు నిప్పుపెట్టుడు. అంతట, నాభస్మము మీకు లభింపఁగలదు. దేవుని యాకలి దీర్చుటకింతకంటె మఱియొక దారిలేదు. అని యాయిల్లాలు లోనికిఁ బోయి తలుపు వైచుకొనియెను. బోయవాఁ డాకుటీరము నగ్ని దేవుని కర్పించెను. ఆచేఁడియ బూడిద దొరకినది. పరమానందమునఁ బురహరుని బూజించెను. భక్తిపరవశుఁడై యుండి యెప్పటియట్ల దేవుని పాదతీర్థము నిచ్చుటకుఁ దన వనితను బిలిచెను. సర్వాలంకారభూషితయై యామె యచ్చటికి వచ్చినది. జ్ఞప్తికిం దెచ్చుకొని యెట్లు వచ్చితివని యామె నడిగి కుటీరమువంకకుఁ జూచునప్పటి కది సమస్తసంపదలతోఁ దులదూగు రత్నభవనమైయుండెను. అంతట మహాశివుఁడు ప్రత్యక్షమై యాబోయ భక్తునింగాంచి, నీనిష్ఠకు సంతసించితిని. కావలయు వరమడుగుమనిన నీతోమమ్ముం గొనిపొమ్మని కోరెను. నీవు చిరకాలము భూమిలో సకలసంపదల ననుభవించి పిమ్మట నాలోకమునకు వచ్చెదవని శివుఁడానతిచ్చి కైలాసమునకుఁ బోయెను. ఆబోయలరాయఁడు శివభక్తి పరాధీనుఁడై సకలసంపదల ననుభవించుచు, సుఖంబుండి నూఱు వత్సరములు జీవించి పిమ్మట భార్యతోఁ గైలాసమునకుఁ బోయెను.

---

# 17. అధికార గర్వమునఁ గ్రిందివారి కపకారము చేయరాదు.



తే॥ గీ। ఉన్నతపదంబునందుండి యొరులయందు
దయ యొకింతయు మనమునఁ దలఁపకుండ
యపకృతులఁ జేయఁదలపెట్టు నధమునకును
తెలియఁబడకుండ నాపదల్ గలుగుచుండు॥

ప్రపంచమునందలి సకలభూతములను సృష్టించి పాలో, పెరుగో, కలియో, గంజియో వేసరక వారికిచ్చి యాదరించి వారి కష్టసుఖములను గనిపెట్టి యేమరకుండు వాఁడు భగవంతుఁడు. ఆతనికి లోకమునందు వారెల్లరు బిడ్డలు. ఆతని చిత్తమున వీఁడెక్కువ వాఁడనియు, వీఁడు తక్కువవాఁడనియు, భేదమోహమాత్సర్యమును లేదు. ఆతఁడు చూచునది మనుజునిపై వేషముగాదు. లోపలనున్న మనసు. ఆతఁడు పరిశీలించునది మనుజుని నటనముగాదు, నడత. ఆతనిచూపు మిగుల దీర్ఘమయినది. ఆతనిచిత్తము మిక్కిలి విశాలమయినది. ఆతని మాట చాలసత్యమయినది. ఆకాశమువలె నెల్లెడలను మనకుఁ గనఁబడకుండ నతఁడు వ్యాపించి నిండియుండి మనుజుని మనసుయొక్కయు మాటయొక్కయు, శరీరము యొక్కయు పనుల నెల్లప్పుడును గను

గలిగి తెలిసికొనుచుండును. ప్రపంచమునకన్న దేవునిస్థూల దేహము వేఱొండులేదు. చక్రవర్తివలె నతఁడెల్లరకుఁ గాను పింపకయే తన యాజ్ఞ చెల్లించుచుండును. ఎట్టి తప్పును మానవుఁడు చేసినను, దైవము నెదుట దాఁగఁజాలఁడు. తప్పక శిక్షనొందితీరవలయును; చెడుగుణములన్న నాతనికిఁ గడుఁ గోపము. అందును గర్వమనిన నతనికిసర్వాసహ్యము. పుణ్యమును జేసి యీశ్వరుని దయను సంపాదించుకొనవల యును, గాని పాపమొనర్చి పరలోకమున బాధ జెందరాదు. పుణ్యపాపములన నెవ్వియోఁగావు. పరులకేదియో యొక రీతి నుపకారము చేయుట పుణ్యము. పరులను బీడించుట పాపము. అట్టి పాపమును జేయువాని కెవ్వియోభయములు గలుగుచుఁ జిత్తమునకు శాంతియుండదు. దీని కీక్రిందికథ తార్కాణము.

ఒక యడవి నడుమఁ బెద్ద మద్దిచెట్టుగలదు. దాని కొనకొమ్మమీఁద నొక పెద్దగ్రద్ద చాలకాలమునుండి గూఁడు కట్టుకొని నివసించుచుండెను. దానికిఁ గలుగు పిల్లల నాగూఁటియందుఁ జల్లగఁ గాపాడుకొనుచుండెను. అడవి యందుఁబడి తిరుగుచు వలసినంత యాహారమును దెచ్చి తాను తనబిడ్డలతో నారగించుచుఁగా తెక్కు, నాయంతవారు లేరని తనవారితో బీరములు వలుకుచుండెడిది. తనపొట్ట బోషించుకొనుట కది యనేకములయిన యల్పప్రాణులను

బీడించుచుండెను.

ఇట్లుండఁ గొంతకాలమున కొకబక్కనక్క యాం చెట్టుప్రక్కనున్న పొదలోనికిఁ గాపురమునకు వచ్చెను. అది యీగ్రద్దతో స్నేహలాభమును గలిగించుకొని యిష్టగోష్ఠిని గాలక్షేపము సేయుచు దాని బ్రదుకది బ్రతుకుచుండెను. ఈ రెండిఁటికిని నానాటికిఁ బ్రాణస్నేహమేర్పడినది. కూఁటి కుండలు వేరయినను మాట మంచిదిగావలెనుగదా? ఇట్లు కొన్ని నెలలు గడచిపోయినవి. బక్కనక్క డొక్కలు బలిసినవి. నిండుగర్భమును దాల్చెను. రెండు పిల్లలను గనెను. ఆపొదయందుఁ బదిలముగ వానిని దాఁచి యాచెలితోఁ జూచుచుండుమనిచెప్పి యెరకొఱ కయ్యరణ్యమునఁ దిరుగఁ బోయెను.

బక్కనక్కకేమి? చక్కని బిడ్డలేమి? యని యా గ్రద్ద యోర్వఁజాలక దీని బిడ్డల నెట్లయిన దొంగిలించి కొని పోవలయునని యాలోచించి నెమ్మదిగ నా పొదలోనికిం జేరి యా రెండిఁటిలో నొక్కకూనను దన ముక్కున గఱచికొనిపోయి తనగూటిలోఁ బెట్టుకొనియెను. సాయంతనమగునప్పటి కాజంబుకము తన పొదకు వచ్చెను. కూనలంజూచుకొనునప్పటి కొకటి కానఁపించినదికాదు. చాల పరితాపమును బొంది యెల్లెడలను వెమకఁజొచ్చెను. ఎక్కడను దానిజాడ చిక్కినదికాదు. మిక్కిలి దుఃఖముతో నా

చెట్టునొద్దకుఁబోయి యాగ్రిద్ద మిత్రునితో నిట్లనియె. మిత్రమా! నాకు లేక లేకఁ గలిగిన రెండు బిడ్డలలో నొక బిడ్డ యేమయినదో? నాకుఁ గనుపించుటలేదు. నిన్ను భద్రముగఁ జూచుచుండుమని చెప్పి పోయితినిగదా? దానిగతి యేమి? ఎచ్చటికిని బోవుటకుఁగూడ శక్తిలేని కన్నులు తెఱువని బిడ్డ నెవ్వరో క్రూరులు హరించియుండవలెను. దాని సంగతి నీకుఁ దెలిసినచో నాకుఁ జెప్పుము. దానిం దెచ్చుకొనుటకు నాశక్తికొలఁదిని బాటుపడుదానను. నాకు భాగ్యమున్నచో నాముద్దుకూన నాకు లభించును. చిర మిత్రుఁడవైనందుల కీయుపకారమును నాకుఁ జేయుము. అని దీనముగఁ బలుకు నానక్కమాటలఁ బెడచెవింబెట్టి యాగ్రిద్ద మాఱుపలుకక విననిదానివలె యూరకుండెను.

ఈ యపకార మాగ్రిద్దవలన జరిగినదే యని నిశ్చయించుకొని యాజంబుకము, ఓయీ! నిన్ను నమ్మిన నా కిట్టి యపకారము చేయుట పాడిగాదు. ఒక్క పూఁటకు నీకు సరిపోవు నాహారమును కాశించి చిరకాలస్నేహమును బోవిడుతువా? నా ముద్దుబిడ్డ నీ గూటిలోనే యుండనోపు. దానిని సంహరింపకుము. నాపసికూనను నాకు విడువుము. నీకు పీలువెంబడి నింతకుమించిన యుపకారమును జేయలేక పోను. నాకడుపుసూటను బాపి స్నేహమును బ్రకటింపుము. అని యనేకవిధములఁ బ్రార్థించెను.

ఉన్నతస్థానముననున్న నాకీ నక్క చేయఁగల యుపకారమేమిగలదని గర్వముతో దానికేమియు నుత్తరము చెప్పినదికాదు.

అంతట నక్క యిదిపనిగాదని యాప్రాంతమునఁ గొందఱు బోయలు మాటవేసి మృగములను గాల్చుకొని వెడలిపోవగా నచ్చట మిగిలియున్న నిప్పుగల కొఱవి నొకటి నోటఁ గఱచుకొనివచ్చి యాగ్రద్దం బిలిచి చెలికాఁడా! ఇటుచూడుము. ఈకొఱవి నీచెట్టు తొఱ్ఱలోఁ బెట్టుచున్నాను. ఈ వృక్షము దగ్ధమగును. నాకపకారము చేసిన నీకీ శిక్ష చేయుటలో నాకు దోసములేదు. అనిన తోడనే గ్రద్ద పెద్దభయముతో వలదు వలదు. చెలిమిఁ దొలఁగకుము. నీబిడ్డను నీకు విడిచెదను. ఇదిగో తీసికొనుము. నా కుటుంబనాశనము సేయకుము. అని దాని కూనను దానికిచ్చివేసెను. నక్క యక్కడనుండి వేఱొక చక్కికిం బోయి సుఖంబుగఁ గాలక్షేపము చేసికొనుచుండెను.

---

# 18. పరులను దూషించుట పాపములకు మూలము.

—:0:—

క॥ ఏకర్ణుని నిష్పందిస
నాకర్ణియె గాలునసెడి యార్యోక్తి వినం
బోకఁ బరుల నిందించెదు
నాకూళలనఘములంటు ననివార్యములై॥

అమరావతియను పురమున వామదేవుఁడను నొక విప్రుఁడుగలఁడు. అతఁడీశ్వరధ్యానపూర్వకముగ సత్కర్మముల నాచరించుచు, ననుదినమునువచ్చిన యతిథిజనుల కన్నోదకముల నిచ్చి యాదరించుచుండెను. బ్రాహ్మణులకు సంతర్పణములు చేయుటయన్న నాతనికిఁ బరమ ప్రియము.

ఇట్లుండ నొక రథసప్తమీ పర్వదినమున వేయి మంది బ్రాహ్మణులకు సంతర్పణముఁ జేయనిశ్చయించుకొని, దానికి వలయుసంభారముల సమకూర్చుకొని యా దినమునకుఁ బెరుఁగు దెచ్చి యిచ్చుటకొక గొల్లవనితకుఁ జెప్పి యామెకు ముందు గొంత ధనమిచ్చెను. ఆగొల్ల పడుచు సమీప గ్రామములకుఁబోయి పెరుఁగును సేకరించుకొని వచ్చుచుండెను. మార్గమధ్యమున నొక పెద్ద వటవృక్షము గలదు. దానిమీఁద నొక గరుడపక్షి యొక కృష్ణసర్పము

ను ముక్కుతోఁ బొడిచికొని తినుచుండెను. ఆసర్ప మా బాధ సహింపఁజాలక విషము గ్రక్కెను. ఆవిషము గొల్ల పిల్ల తలపైనున్న పెరుఁగుకుండలోఁబడెను. అది యామె గుర్తింపలేదు. ఆదధిభాండముంగొనిపోయి బ్రాహ్మణున కిచ్చెను. ఆతఁడా పెరుఁగును సహస్రబ్రాహ్మణులకు వడ్డించెను. బ్రాహ్మణులు సుఖముగా భుజించి కొలదికాలములోనే మూర్ఛాగతులై చాలమంది మరణించిరి. వామదేవుఁడు నిశ్చేష్టుఁ డయ్యెను.

లోకులలోఁ జాలమంది యా వామదేవుని పలుపరి విధముల నిందింపఁ జొచ్చిరి. వామదేవుఁ "డేపాపము నెఱుఁగను. పుణ్యమునకు బోవఁ బాప మెదురయ్యె" నని విచారించెను."

ఈ విషయమునుగూర్చి దేవలోకమున నింద్రుని యాధిపత్యమున బెద్ద సభజరిగెను. ఈసభ నెన్నియో ప్రశ్నలు వచ్చెను. ఆహారార్థమై సర్పమును జంపిన గరుడుఁడు నిర్దోషియనిరి. బాధభరింపలేక విషము గ్రక్కిన పామునకుఁ బాపములేదనిరి. ఎఱుఁగని గొల్లదానికి పాపమంటదనిరి. ఏపాపము నెఱుఁగని యాబాపని కేపాపమునకు నేపాటి సంబంధముఁ జూపనోపమనిరి. ఈ సహస్రబ్రాహ్మహత్యా మహాపాపమెవ్వరికి భరింపవలయును? బ్రాహ్మణుని దూషించిన ప్రజలు భరించవలెనని తీర్మానించిరి.

అట్లా పాతకమును, బ్రాహ్మణుని దూషించిన వారెల్ల సమముగఁ బంచుకొని యమలోకమున ఫలము ననుభవింపవలసివచ్చెను.

సంపూర్ణము.

సీతారామా ముద్రాక్షరశాల, నర్సాపురం, 272—30—1000.

BCL

# కమలకుటీరము వారి స్వంత ప్రచురములు.

స్కూలుఫైనలు విద్యార్థుల కీరెండు గ్రంథములును ముఖ్యపఠనార్హములు.

ఆంధ్రవాఙ్మయచరిత్రము 3—0—0
శతకకవుల చరిత్రము… 3—0—0

వేమన జీవితచరిత్రము … 1—8—0.

విద్యార్థులకు పఠనార్హములైనవి.

ప్రభాతము (కృష్ణదేవరాయల దివ్యచారిత్రము)
3, 4, 5, ఫారములకు 0—12—0.

లలితకుమారి (మనోహరనవల)
3, 4, ఫారములకు 0—12—0.

మణిమేఖల. (నవీన కథల సంపుటము)
2, 3, ఫారములకు 0—12—0.

క మ ల కు టీ ర ము
హెడ్డాఫీసు:—నర్సాపురం.

# కమలా
# కథావాచకము.

గ్రంథకర్తలు,
కె. వి. సుబ్బారావు పంతులుగారు, బి. ఏ. ఎల్. టి.
అనిపెద్ది జగన్నాథశాస్త్రులుగారు.

| | | |
|---|---|---|
| మొదటి తరగతి. | ... | 0—3—0 |
| రెండవ తరగతి. | ... | 0—3—0 |
| మూడవ తరగతి. | ... | 0—4—0 |
| నాల్గవ తరగతి. | ... | 0—4—0 |
| ఐదవ తరగతి. | ... | 0—5—0 |

పురాణకథలు,
చరిత్ర కథలు,
నీతి కథలు
సమకూర్పఁబడి ముద్రింపఁబడినవి.

ఆంధ్ర బాలబాలికలకు భాషాభిరుచియు,
ప్రపంచజ్ఞానమును, నీతివర్తనమును
అలవడఁజేయునవి
కమలా కథావాచకములే!

కమలకుటీరము, నరసాపురం.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B189 |
| పుస్తకం పేరు | వీతికథారత్నావళి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | progathi |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |